శ్రీరస్తు

# విజయవిలాసము

చేమకూర వేంకటకవి ప్రణీతము



వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్

మదరాసు -1

వారిచేఁ బ్రకటితము.

# పీఠిక



సుభద్రాపరిణయ మను నామాంతరము గల యీ విజయ విలాసమును చేమకూర వేంకటకవి రచించెను. ఇయ్యది తంజావూరునకుఁ బ్రభువగు రఘునాథ రాజున కంకిత మొనర్పఁబడి యున్నది. ఈ రఘునాథరాజు క్రీ.శ. 17వ శతాబ్దారంభమున రాజ్యము చేసినట్లు కానవచ్చుచున్నది. కావున నీ కవియును ఆ కాలముననే యుండెననుట స్పష్టము. విజయవిలాసము వ్రాయుటకుఁ బూర్వము వేంకటకవి సారంగథరచరిత్ర మను నొక పద్య కావ్యమును రచించి యీ కృతిపతికే యంకితముఁ జేసి యుండెను.

చేమకూర వేంకటకవి ఆంధ్ర నియోగి బ్రాహ్మణ వంశ సంజనితుఁడని కొందఱును, భోగినీకుల సంజాతుఁడని మఱి కొందఱును భిన్నాభిప్రాయులై యున్నారు. ఎట్టికులమున బుట్టినను ఈ సరస కవి తన కవితా మహిమచే తన కులమునకు వన్నెయును వాసియును దెచ్చి యుండెననుటకు సందేహము లేదు. విజయవిలాసము తెలుఁగునఁ గల యత్యుత్తమ ప్రౌఢకావ్యములలో నొకటి యని సకలపండిత జనంబులచే నేకగ్రీవముగా గొఁనియాడఁ బడుచున్నది. ఈ సుకుమారకావ్యము వ్యంగ్య ప్రధానమై, ప్రతిపద్య రసాస్పదమై ఉచిత శబ్దాలంకారశోభితమై వినువారి వీనుల నమృతంపుసోన లొలుకు సరసావచోరచనల నలరారుచున్నది.

ఇందలి యితివృత్తము శ్రీ మహాభారతమునుండి గ్రహింపఁ బడినది. అర్జునుడు బ్రాహ్మణగోసంరక్షణార్థమై విలునమ్ములు గొన ధర్మరాజు నంతఃపురంబునఁ జొచ్చి సమయభంగంబుఁ గావించుటయుఁ, దన్నివారణార్థమై భూప్రదక్షిణ మొనర్ప నగ్రజు ననుజ్ఞఁ గొని బయలుదేరుటయు, మార్గమధ్యంబున నులూపి యను నాగకన్యచే వరింపబడుటయు, నటమీఁదఁ బాండ్యదేశాధీశుండగు మలయధ్వజ మహారాజుచే సమ్మానితుండై తదీయ నందనయగు చిత్రాంగదను వివాహమాడుటయు, నచ్చటనుండి శ్రీకృష్ణుని చెల్లెలగు సుభద్రను వివాహమాడు తలంపున యతివేషములో ద్వారకాపురంబుఁ జేరుటయుఁ, గృష్ణానుమతిచే దేవకీ వసుదేవులొసంగ బలరామునికిఁ దెలియకుండ సుభద్రను వివాహమై ద్వారకా పురంబు వెడలి త్రోవనడ్డగించు యాదవ సైన్యంబుల గెల్చి యింద్రప్రస్థంబుఁ జేరి సహోదర బంధుమిత్ర సమాధారణముం బొందుటయు, సుభద్రయందుఁ బుత్రరత్నంబగునభిమన్యుఁ గాంచుటయు మొదలుగాఁగల విషయంబు లిందతిమనోహరములుగ నభివర్ణింపఁబడి యున్నవి.

తండియార్పేట,
చెన్నపురి.

వావిళ్ళ వేంకటేశ్వర్లు

# పీఠిక



## ఇష్టదేవతా స్తుతి



లెల్లప్పుడొసంగ నీ సకల ధాత్రీ చక్రమున్ బాహు పీ-
ఠీ లగ్నంబుగఁ జేయ, దిగ్విజయ మీ డీకొన్న చందాన నే
వేళన్ సీతయు, లక్ష్మణుండుఁ దను సేవింపంగ విల్ పూని చె-
ల్వొ లీలన్ దగు రామమూర్తి రఘునాథాధీశ్వరుం బ్రోవుతన్. 1

ఉ. శ్రీ కలకంఠకంఠియు, ధరిత్రియు దక్షిణ వామ భాగముల్
గైకొని కొల్వ, వారిఁ గడఁకన్ గడకన్నుల కాంతిఁ దేల్చి, తా
నా కమలాప్తతం గువలయాప్తతఁ దెల్పెడు రంగ భర్త లో
కైక విభుత్వ మిచ్చు దయ నచ్యుతు శ్రీ రఘునాథ శౌరికిన్. 2

ఉ. 'శ్రీ రుచిరాంగి నీ భవన సీమ ధ్రువంబుగ నిల్చు; నేలు దీ
ధారుణి నీవ' యన్న క్రియ దక్షిణపాణి నెఱుంగఁజేయు శృం
గార రసాబ్ధి వేంకటనగ స్థిరవాసుఁడు పూర్ణదృష్టి నెం
తే రఘునాథ భూరమణదేవు గుణంబుల ప్రోవుఁ బ్రోవుతన్. 3

తే. ధీయుతుఁ డటంచు నలువ దీర్ఘాయు వొసఁగి
కాయు రఘునాథ విభు వజ్రకాయుఁ గాఁగ;
వీరవరుఁ డని హరుఁ డత్యుదార కరుణఁ
జేయు నెప్పుడు విజయు నజేయుఁ గాఁగ. 4

మ. మొగుడుం దమ్ముల విప్పునప్పుడు రజంబున్, జక్రవాళంపుఁ గొం
డగడిన్ దేఱుగ డైన పట్లఁ దమమున్, మందేహులన్ దోలి వా
సి గడల్మీన్ తటియందు సత్త్వముఁ ప్రకాశింపన్ త్రిమూర్త్యాత్మకుం
డగు తేజోనిధి వేడ్కఁ జేయు రఘునాథాధీశుఁ దేజోనిధిన్. 5

శా. మాద్యద్దంతి ముఖార్చనా నియమముం బాటించు నెల్లప్పుడున్;
సద్యఃపూర్ణ ఫలాప్తిచే మనుచు నంతర్వాణులన్ మామనో
హృద్యుం డౌ రఘునాథశౌరి యని కూర్మిన్ సాటికిన్ బోటికిన్
విద్యా బుద్ధు లొసంగి ప్రోతు రతనిన్ విఘ్నేశుఁడున్, వాణియున్. 6

శా. ప్రాగల్భ్యంబున విష్ణు శంభు మతముల్ పాటించి, సర్వంసహా
భాగం బందు సమప్రధాన గతి యొప్పన్ రాజలోకంబులోఁ
దా గణ్యుం డని యచ్యుతేంద్ర రఘునాథ క్షోణిభృన్మౌళికిన్
శ్రీ గౌరుల్ సమకూర్తు రాహవజయ శ్రీ గౌరులన్ నిత్యమున్. 7

మ. ప్రకట శ్రీహరి యంఘ్రిఁ బుట్టి, హరు మూర్ధం బెక్కి యాపాద మ
స్తకమున్ వర్ణన కెక్కు దేవి సహజోదంచత్కులోత్పన్న నా
యక రత్నం బని యచ్యుతేంద్ర రఘునాథాధీశ్వర స్వామికిన్
సకలైశ్వర్యములున్ నిజేశువలనన్ దాఁ గల్గఁగాఁ జేయుతన్! 8

## కృతిపతి వంశ ప్రశస్తి

క. ఆ రాజ శేఖర ప్రియ
వారిజముఖి తోడు గాఁగ వర్ధిలు విమల
శ్రీరుచిర వర్ణమున ధా
త్రీరంజన సుకృతి చెవ్వనృపతి జనించెన్. 9

క. ఆ చెవ్వ నృపాలాగ్రణి
యాచంద్రార్కముగఁ గాంచి, నరుణాచల వృ
ద్ధాచలములఁ గట్టించె, మ
హాచతుర సమీర గోపురావరణంబుల్. 10

తే. శీవి నచ్యుత రాయల దేవి యైన
తిరుమలాంబకు ననుజయై తేజరిల్లు
మూర్తమాంబను బెండ్లియై కీర్తి వెలయఁ
జెవ్వ విభుఁడు మహోన్నత శ్రీఁ జెలంగె. 11

క. ఆ మూర్తమాంబ కఖిల మ
హీ మండల నాథుఁ డచ్యుతేంద్రుఁడు, సుగుణో
ద్ధాముఁడు జన్మించెన్; ద
ద్భూమీపతి రంగధాము పూజన్ మించెన్. 12

శా. శ్రీ రంగేశుఁడె వచ్చి, యచ్యుత ధరిత్రీభర్త యై, భాగ్య రే
ఖారూఢిన్ విలసిల్లి, తానె తనకున్ గైంకర్యముల్ చేసెఁగా
కే రాజైనను జేయఁగాఁ గలిగెనే యిట్టీ విమానం బహో!
భూరి స్నిగ్ధముగా, మహామణిమయంబుల్ గాఁ గిరీటాదులున్? 13

చ. గెలిచిన గెల్పు, లర్థితతికిన్ దిన మిచ్చిన యీవులన్ వహుల్
తలఁచిన విక్రమార్కు లొక లక్షయుఁ, గర్ణులు కోటియున్, గదా!
కలిగిన నీడు వత్తు రనఁగాఁ దగు సాహస దాన సద్గుణం
బులు ధర యందుఁ బుట్టఁగనె పుట్టిన వచ్యుత భూమి జానికిన్. 14

శా. వీరాగ్రేసరుఁ, డర్థి పోషణ గుణావిర్భూత భాస్వద్యశో
ధౌరేయుండు, మణీతులాదిక మహా దానావళుల్ సేయఁ దా
నౌరా! మార్గము వెట్టినట్టి ఘనుఁ, డాహా! లోకమం దచ్యుత
క్ష్మారాణ్మౌళి యొనర్చు పుణ్య మహిమల్ శక్యంబె లెక్కింపఁగన్? 15

## రఘునాథ నాయకుని రమణీయ గుణగణములు

క. ఆ పుణ్య ఫలంబుననె ద
యాపాథోరాశి యైన యల యచ్యుత భూ
మీపతికిన్ రఘునాథ
క్ష్మా పాలుం డుదయ మయ్యె జైవాతృకుఁడై. 16

ఉ. పుట్టిన దాదిగాఁ దనదు పుణ్యమె దాదిగ, వైరిభూమి భృ
ద్ఘట్ట మదంబు దాదిగ, సదా దిగధీశ నుత ప్రతాపుఁడై
పట్టమహాభిషేక బహుభాగ్య ధురంధరుఁడై యయోధ్య య
న్పట్టణ మేలు సామియె యనన్ రఘునాథ విభుండు వర్ధిలున్. 17

మ. రసికుండౌ రఘునాథు కీర్తిసతి యౌరా! తొల్త వాగ్బంధమున్,
రసవాదంబును, రాజవశ్యవిధి నేరంబోలుఁ; గాకున్న వె
క్కసపుం బ్రౌఢి వహించి శేషఫణి మూఁగం జేయఁ, దారాద్రి ను
ల్లసముల్ వల్కఁగ, ఛత్ర చామర మహా లక్ష్మల్ నగన్ శక్యమే? 18

చ. నలువగ నెన్ననైన రఘునాథ నృపాలుఁడు గల్గఁగా మహీ
స్థలి నిఖిలైక ధర్మములుఁ దామర తంపరలై చెలంగెఁ; గొ
ల్లలుగ నశేష సజ్జన కులంబు సుఖంబు గనెన్; సమస్త వి
ద్యలుఁ గసటెల్లఁ బాసి మెఱపై వెలపెట్టె సభాంతరంబులన్. 19

ఉ. శైలము లెక్కి, యష్ట మద సామజ మౌళుల మీఁదుగా, మహా
కోలకులేంద్రు వాడి, బలు కొమ్ము మొనం బడి, సర్వదా విష
జ్వాలలు గ్రమ్ము శేషు తల చాయనె యోడక వచ్చి కూడె నౌ;
భూ లలితాంగి కెంత వలపో రఘునాథ నృపాలమౌళిపై? 20

సి. రత్నాకరాంతోర్వరా విహారుం డౌట నగ్రహారము లసంఖ్యముగఁ జెసె;
నమిత దానవినోది యౌటఁ గక్ష్యాంతర భద్రకుంభీక్షణ పరతఁ దనరె;
దక్షిణ నాయకోత్తముఁ డౌట మేలైన మలయజగంధి మండలము నేలె;
భరత విద్యా ధురంధరుఁడౌట రంగస్థలంబు రామాలంకృతంబు చేసె;
తే. నౌర! కర్ణాట సింహాసనాధి రాజ్య భరణ నిపుణ రణోద్దండ బాహుదండ
జనిత సాపత్న్య సంవాద జయరమా మహీ లలిత కేళి రఘునాథ నృపతిమౌళి. 21

శా. రాజున్, భోగియు, సౌమ్యుఁడున్, గవియు, సర్వజ్ఞుండు నీ డౌనన్,
దేజః ప్రౌఢవచో వివేక నయ భూతి శ్లాఘులన్ మించు నౌ,
రాజున్, భోగియు, సౌమ్యుఁడున్, గవియు, సర్వజ్ఞుండు నెబ్బంగులన్,
యోజింపన్ రఘునాథ భూరమణ వర్యుండే ధరామండలిన్. 22

సీ. అరిది సింగపుఁబల్ల మమరించె నే రాజు మేలుఁ దేజికిఁ బదివేలు సేయఁ
జికిలి బంగరు దిండ్ల పికిలి కుచ్చుల యందలంబెక్కె నే రాజు లక్ష సేయఁ;
గనక మయంబుగాఁ గట్టించె నే రాజు సాటిలేని నగళ్ళు కోటి సేయఁ
గంఠమాలిక మొదల్ గాఁ బెట్టె నే రాజు గొప్ప సొమ్ములు పదికోట్లు సేయ;
తే. నతఁడు విభుమాత్రుఁడే! బహుళాగ్రహార నిత్య సత్త్ర మహాదాన నిరత పోషి
తాహిమాచల సేతు ద్విజాభిగీర్ణ పుణ్యవిభవుండు రఘునాథ భూవిభుండు. 23

చ. త్రికరణ శుద్ధి నచ్యుతుని శ్రీరఘునాథ నృపాలు వైఖరిన్
సకల మహీసురావళికి సత్త్రము లెప్పుడుఁ బెట్టలేఁడకా
యొకదొర, యందు లెక్క విని యొక్కొక నాఁటికె యింత రొక్క! మిం
తకుఁ దెగసాగెనా! యనక తా ముద మందినఁ జాలు నెమ్మదిన్. 24

సీ. అడుగుమాత్రమె కాక యంత కెక్కుఁడుగ నీఁ జాలెనే యల బలిచక్రవర్తి?
యా వేళ కటు దోఁచినంత మాత్రమె కాక కోర్కి కెచ్చిచ్చెనే యర్కసూతి?
తూఁగిన మాత్ర మిత్తు ననెఁగా కిచ్చ వచ్చినది కొమ్మనియెనే శిబి విభుండు?
కలమాత్ర మపు డిచ్చెఁ గాక కట్టడ గాఁగ ననిశంబు నిచ్చెనే యమృతకరుఁడు?
తే. వారి నే రీతిఁ బ్రతి సేయవచ్చు నెల్ల యర్థులఁ గృతార్థుల నొనర్చునట్టి యప్ర
తీప వితరణికి, మహా ప్రతాప తిగ్మ ఘృణికి, నచ్యుత రఘునాథ నృపతి మణికి? 25

ఉ. తప్పులు వేయుఁ గల్గినను దాళును నమ్మిన వారిపట్లఁ; దాఁ
జెప్పినమాట యూర్జితము సేయు; నొకండొరుమీఁదఁ గొండెముల్
సెప్పిన వానికై మనవి చెప్పిన రీతిగ నెంచు; నీడు గా
రిప్పటి రాజు లచ్యుత నరేంద్రుని శ్రీ రఘునాథ శౌరికిన్. 26

సీ. ఆకారమున నలునంతవాఁడౌనె కా హయ సమ్యగారూఢి నంతవాఁడె!
యతి దయామతి రాము నంతవాఁ డౌనె కా యసమాన గురుభక్తి నంతవాఁడె!

యమృషోక్తి ధర్మజు నంతవాఁ డౌనె కా యన్నసత్త్ర ఖ్యాతి నంతవాఁడె!
యాలంబునఁ గిరీటి యంతవాఁడౌనె కా యమిత నాట్య ప్రౌఢి నంతవాఁడె! 27

తే. రసికమాత్రుండె యంతఃపుర ప్రడీన సార సారస్వతాధార శారికాళు
కవన కృత ముఖ శుక కళా కలన హృష్ట బుధజనాస్థాని రఘునాథ భూమిజాని? 28

ఉ. మాటల నేర్పులా! సరస మార్గములా! కొలు వుండు రీతులా!
పాటల గంధులా! కళలభాగ్యములా! బహు దాన లీలలా!
నాటకశాలలా! యొకటనన్ వల దెన్నిటఁ జూడ నన్నిటన్
మేటియుఁ, గీర్తిలోలుఁడు జుమీ! రఘునాథ నృపాలుఁ డిమ్మహిన్. 29

వ. అని రఘునాథ మహీకాంతు ననంత శోభన గుణమ్ములలోన గొన్ని యభివర్ణించి.

తే. నన్ను నడిపిన బహుళ సన్మాన మెంచి
యఖిల విద్యా విశారదుఁ డగుటఁ గాంచి
యవని నింతటి రాజెవ్వఁ డని నుతించి
కృతులొసఁగఁ గీర్తి కలదని మతిఁ దలంచి. 30

ఉ. తా రసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేకకృతుల్ ప్రసన్న గం
భీరగతిన్ రచించి మహి మించినచో నిఁక శక్తు లెవ్వ ర
య్యా! రఘునాథభూప రసికాగ్రణికిన్ జెవి సోఁకఁ జెప్పఁగన్? 31

మ. కలిగెంగా తన సమ్ముఖం బనియు, సత్కారంబు తాఁజేయ నా
తల నెందే శిరసా వహింతు రనియుం, దాఁగాక లేదెందు సా
ధులకున్ దిక్కనియున్, దయన్ మనుపు రీతుల్ గాక శక్యంబె వి
ద్యల మెప్పింపఁగ నచ్యుతేంద్ర రఘునాథస్వామి నెవ్వారికిన్? 32

చ. అని గణియించి యైనను, గుణాంశ మొకించుక కల్గినన్ బళా
యను; నదిగాక మిక్కిలి నిజాశ్రిత పక్షము కల్గు సత్కృపా
ఖని, యణుమాత్ర మైన నొక కానుక దెచ్చినఁ గొండగాఁ గనున్;
మనమున నచ్యుతేంద్ర రఘునాథుఁడె శ్రీరఘునాథుఁ డెన్నఁగన్ 33

క. కావున నే నొనరించిన
యీ 'విజయవిలాస' మనెడి కృతి రత్నంబున్
గేవల భక్తిని గానుక
గావించెద నని నితాంత కౌతూహలినై 34

## కృతి సమర్పణము

క. శుభ వాసరమున, సయ్యేడ,
నిభవాజిముఖోపదా నిరీక్షేచ్ఛ మహా
విభవాభిరాముఁడై భా
వభవాకృతి భద్రపీఠ వాసోజ్జ్వలుఁడై 35

సీ. కుందనంపుఁ బసిండి కుళ్లాయి జగలపైఁ జౌకట్ల నిగనిగల్ చౌకళింప;
హురుముంజి ముత్యాల యరచట్టపై గొప్ప పతకంపు హారముల్ పరిఢవిల్ల;
వెలఁ జెప్పరాని కెంపుల వంక జముదాడి పీతాంబరంబుపైఁ బెరిమె నెఱప;
గబ్బి మన్నె కుమార గండపెండేరంపు జిగి పదాగ్రంబుపైఁ జెంగలింప;

తే. దొరల మంత్రులఁ గవుల నాదరణ సేయు కరము కంకణకాంతి నల్గడల నిండ,
నిండు కొలు వుండెఁ గన్నుల పండువుగను తీవి నచ్యుత రఘునాథ భూవిభుండు 36

తే. అట్టు లొడ్డోలగం బున్న యవసరమున
వినయ భయ సంభ్రమములు నా వెంట నంట
ననుఁ గృపాదృష్టిఁ జల్లఁగాఁ గనుచు నుండ
సమ్ముఖమ్మున కరిగి, యంజలి ఘటించి 37

ఉ. ఏలిక మాత్రమే? మహిమ నీశ్వరుఁడే తలపోసి చోడ, నా
పాలిటి రామభద్రుఁ డని బంగరుఁబూవులఁ బూజ చేసి, నేఁ
జాల నలంకృతిం బొసఁగు సత్కృతి కానుక చేసి, కీర్తి భూ
శ్రీ లలితాంగులన్ వలవఁ జేసిన శ్రీ రఘునాథ శౌరికిన్ 38

ఉ. శ్రీ రస భావముల్ వెలయఁ జెప్పి ప్రబంధము లెన్నియేని మీ
పేరిట నంకితం బిడిన బిడ్డల నెందఱఁ బేరు పెట్టినన్
దీరునె మీ ఋణం? బయినఁ దెచ్చితిఁ గాన్క పరిగ్రహింపు మ
య్యా! రఘునాథ భూప రసికాగ్రణి! మామక కావ్య కన్యకన్ 39

సీ. ఘోటక ఖుర పుట క్షుణ్ణ ధరా జాత పాంసువు పై నుల్లభంబు గాఁగ,
భట సింహ విక్రమోద్భట సింహనాదముల్ స్వస్తి వాదంబుల చంద మొందఁ,
బది దిక్కు లొక్కటఁ బగిలి బీఁటలువాఱఁ భేరీ నినాదముల్ బూరటిల్ల,
విజయ సమారబ్ధ వేళఁ గౌతుకమున మొగమున గరువంపు మురువు దోఁప,

తే. నౌర! పెండ్లికి నేఁగిన ట్లనికి నేఁగి యక్ష తంత్రంబు లివి యేటి లక్ష మనుచు
రేక మోవక గెల్చుట నీకె చెల్లు సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 40

సీ. ఎంచి రంటివి గాని యీ సారి గట్టిగాఁ దెగుఁ గార్య మను వార్తఁ దెలుపవైతి;
మించి రంటివి గాని మేదిని యదరంగ నడిచె సైన్యం బని నుడువ వైతి;

వంటి రంటివి గాని యాభీలతర భటో ద్భట సంగరం బని పలుక వైతి;
మొగిసి రంటివి గాని ముకుటములెత్తిగి రాజ శేఖరుల్ పడుట సూచింప వైతి;

తే. వనుచు నీధాటి కెరవాఱు నహితవీరు లదరునను మాట వెడలక బెదరి పల్కు
చారుఁ గని నేర మెంతురు సారె సారె సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 41

సీ. భిన్న కటంబులై పేరు పెంపును లేక గంధనాగంబు లెక్కడ నడంగె?
బాహ్లీక శక సింధు పారసీకోద్భవ హయ ధట్ట మే గొందియందు డిందెఁ?
బోటు గంటులఁ దూఱిపోవు దారుణ మైన మాస్టీల గమి యెందు మ్రగ్గిపోయె?
గర్వంబు మేనులు గన్నట్టు లుండెడు దొరల యామిక లెందుఁ దొలఁగి పోయెఁ?

తే. బరుల పాళెంబు లీ రీతిఁ బన్న మొంద మాయ వన్నెను నీ ఖడ్గ మంత్రవాది
గెలిచినను నేమి మేలైన గెలుపు గంటి! సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 42

సీ. రంభ వాకిటను దోరణములు గట్టెడు తీవర మొక కొంత దీలుపడియె;
మేనక యింటిలో మేల్కట్లు సవరించు సంరంభ మొక కొంత సడలువాఱెఁ;
గనకాంగి యింటిలోఁ గర్పూరవేదికల్ సవరించు టొక కొంత జాగుపడియె;
హరిణి బంగరు మేడ నరవిరి సెజ్జలు నిర్మించు టొక కొంత నిలుక డయ్యె;

తే. మబ్బు గొబ్బున నీ శౌర్యమహిమ వినక, తెగువ తోడుత నెదిరించి, తిరిగి, విఱిగి
పాఱిపోయిన మన్నీల పాటు సూచి సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 43

సీ. అతుల భూరి ప్రతాపార్క దీధితిచేత గట్టిగాఁ గాఁకలు పుట్టు పిదప,
ఘోరారి గళరక్త ధారాళ వృష్టిచే నాని దుక్కికిఁ బద నైనపిదప,
హయ ధట్ట ఖురపుట హల్యాముఖంబున నంతట దున్నిన యట్టిపిదప,
మొలచిన నీ కీర్తి మొలకలు తఱుచుగా వెదపెట్టి పైరు గావించుపిదపఁ,

తే. గాపు నిలుపవె బేతాళ గణమునెల్ల నట్టి పట్టుల కరిగి నీ వరుల నోదె
పాటు చేసితి వనుట యేపాటి తలఁప సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 44

సీ. ఒకరు వోయిన దెస కొకరు వోవక పాఱ నరివీరులకు దాహగరిమ మించె;
గడగడ వడఁకి నల్గడల కేఁగక భీతిఁ జెందిన వారిపైఁ జెమట పుట్టె;
మున్నాడి యెలగోలు మూఁకలఁ బోట్లాడు పరుల మైఁ బాటల ప్రభలు మీఱెఁ;
జేగ దెచ్చుక కొంత సిగ్గున నెదిరించు రాజుల యొప్పు బీరము తొలంగెఁ;

తే. దెగువతోడుత ధరియించి తీవ్ర కోప భరిత రూక్షాక్షి నియమిత ప్రభల పేర
నీవు ఘర్మార్క విస్ఫూర్తి నెఱపునపుడు సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 45

సీ. తలలు వీడఁగఁ బాఱు ధరణీశ్వరులఁ జూచి యంటి వెన్నాడని యట్టి మహిమ,
పడిన యేనుంగుల ప్రక్కల కొదిగిన రాజులఁ జూడని రాజసంబు,

జళిపించు చంద్రహాసములు పాఱఁగ వైచి మ్రొక్కువారల మీఁద మొనపు కరుణ,
నెత్తురు గనుపట్ట హత్తిన భీతిచేఁ గలవరించినవారిఁ గాచు గరిమ,

తే. మెన్నఁ దనమీఁద బలముతో నెనసి మొనసి విఱుగు రాణువఁ బొమ్మను వీరవరుని
కీర్తిఁ గంటివి జగదేక కీర్తనీయ సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 46

క. అని విన్నవింపఁ జిత్తము
నన లొత్తఁ బరిగ్రహించి నాపై నింతిం
తనరాని వత్సలత్వము
కనిపింపఁగ హర్షభర వికస్వర ముఖుఁడై. 47

తే. కల నయిన మిమ్ముఁ గా కన్యుఁ గొలువనంటి,
కృతు లొకరి కీను మీకె యంకితములంటి,
పలికిన ప్రతిజ్ఞ చెల్లింప వలదె యిట్లు?
వాఙ్నియమ రూఢి నీయంత వాఁడెఁకేఁడి? 48

క. వాసించుఁ గవిత చెప్పిన
వీసర వో వొకట; భక్తి విశ్వాసంబుల్
నీ సొమ్ములు; సామాన్యుఁడ
వే? సూర్యవరప్రసాది విజ్జగమెఱుఁగన్ 49

క. ప్రతి పద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్ప నేర్తు; వెల్లెడ బెళు కౌ
కృతి వింటి మపారము గా
క్షితిలో నీ మార్గ మెవరికిన్ రాదు సుమీ! 50

తే. క్షత్త్ర ధర్మమ్మె కద నీకుఁ గలది మొదలఁ
దమ్ములు సుతుల్ హితులు గూడ మమ్ముఁ గొలిచి;
తిపుడు కృతియును జెప్పి మా కిం పొనర్చి;
తొకటఁ గా దన్నిటను బ్రయోజకుఁడ వీవు. 51

తే. అని సుధా మధురోక్తుల నాదరించి
మంజుల పదార్థ భూషణాంబర కదంబ
కరి తురంగాది వాహనోత్కరము లిచ్చి
న న్నసాధారణముగ మన్నన యొనర్చ. 52

చ. అభినవ భోజరాజ బిరుదాంకుఁడు శ్రీ రఘునాథ శౌరి నన్
శుభమతి నేలినందులకు సూడిద చేసితి, నౌర! మిక్కిలి
న్సభల గణింప మన్నన లొనర్పఁ బ్రబంధము నింతయుత్తమ
ప్రభునకు నంకితం బొనరుపం గలిగెం గద! యంచు వేడుకన్ 53

ఉ. ఆనతి యిచ్చెనా, యది శిలాక్షర; మెవ్వని నెని మెచ్చెనా,
వానిఁ గృతార్థుఁ జేయుఁ; బగవాఁ డయినన్ శరణంబుఁ జొచ్చెనా,
యా నరు నేర మెంచక తనంతటివాని నొనర్చు; నిచ్చెనా,
యేనుఁగుపాఁడి; యీడు గలదె రఘునాథ నృపాలమౌళికిన్? 54

ఉ. ఎందును విద్య మేలెఱుఁగ రెవ్వ; రెఱింగినఁ గొంతమాత్రమే;
యందును సాహితీ రస మహత్త్వ మెఱుంగ; రెఱింగిరేని యా
యంద మెఱుంగలే; రెఱిఁగినప్పటికిన్ విని మెచ్చి యీయ; రె
న్నం దగు నచ్యుతేంద్ర రఘునాథ విభుండె ప్రవీణుఁ డన్నిఁటన్ 55

సీ. ఏ రాజు భుజశౌర్య మేదులఖానాది వజ్రీల చెలిమికి వశ్య విద్య,
యే రాజు విక్రమసారంబు విద్వేషి మహిమ పలాయన మంత్రశక్తి,
యే రాజు వీక్ష సమీహిత కర్ణాట రమ నాట్య విద్యకు రంగభూమి,
యే రాజు చరితంబు వారాశి వేష్టిత మేదినీ పతులకు మేలుబంతి,

తే. యతఁడు చెలువొందుఁ జినచెవ్వ యచ్యుతేంద్ర బహు జనన పుణ్య పరిగణ్య ఫలనిభాత్మ
పుత్త్రభావ ప్రమోద సంపూర్ణ హృదయ పంకజాక్షుండు రఘునాథ పార్థివుండు. 56

సీ. సింహాసనము మాట శిథిల మౌటలు విని గట్టిగా నిలుపఁ గంకణము గట్టెఁ;
గోటిసంఖ్యలు మీఱఁ గూర్చిన ధనరాశిఁ గొల్చు వారల కిచ్చెఁ గొల్చు వలెనె;
తుండీర పాండ్యాది మండలేశ్వరులపై దండెత్తి విడిసె నుద్దండ మహిమ;
నేల యీనినయట్లు నిలిచిన వైరులఁ బంచబంగాళమై పాఱఁ దఱిమె;

తే. గర్వితారాతి మస్తక ఖండనోత్థ రక్తధారానుషంగాతిరక్త ధార
నిజ కృపాణికఁ గావేరి నీటఁ గడిగె నిఖిల గుణశాలి రఘునాథ నృపతిమౌళి. 57

సీ. ఘన ఘనా ఘనముల కాల సంకెలఁ బెట్టు పాండ్యుని వెన్నాడి పాఱఁ దఱిమెఁ;
దుండీర నాథుండు దురమునఁ బఱవంగఁ జూచి ప్రాణము దయఁ గాచి విడిచెఁ;
గయ్యాన వెనుకఁ ద్రొక్కని రాజు లెదిరింపఁ జేరిన రాజ కౌశికులఁ బట్టెఁ;
బోరాడఁగా రాని వైరుల కోటలు పంపులచే లగ్గపట్టి తివిచె;

తే. నితఁడు సామాన్యుఁడే ధర నెంచి చూడ విజయ నిస్సాణ రావ నిర్విణ్ణహృదయ
భీత రాజన్య సైన్య నిర్భీతిదాన బిరుద నిజపాణి రఘునాథ భిదురపాణి. 58

ఉ. ఇచ్చునెడన్ బదార్థ మడి గిచ్చునొ; తా దయసేయఁ గాదనన్
వచ్చునొ; మించి యొక్కఁ డన వచ్చినఁ దా నది యిచ్చగించునో
యిచ్చిన నిచ్చెనే; సరిగ నెవ్వరిపై దయచేసెఁ జేసెనే;
యచ్చతురాస్యుఁడున్ దెలియఁ డచ్యుతు శ్రీరఘునాథుని చిత్తమున్ 59

## షష్ఠ్యంతములు

క. ఏతాదృగ్గుణ ఖనికిన్,
సీతాదృజ్మోహనాంఘ్రి సేవా ధనికిన్,
శాతాసికలిత బాహా
స్వీతాసిక విమతరాజ నిఖిలావనికిన్ 60

క. సాక్షాన్మనోజునకు, క్షో
దక్షమ రస భావ సుకవితా భోజునకున్,
దాక్షిణ్య గణేయునకున్,
దక్షిణ సామ్రాజ్య విభవ ధౌరేయునకున్ 61

క. సుస్థిర లక్ష్మీ మహిత మ
ణిస్థగిత గృహాంగణునకు, నేపాళ నృపా
ల స్థాపన చణునకు, సక
లాస్థాన ప్రణుత వర గుణాభరణునకున్ 62

క. కీర్త్యౌదార్యాధరి తా
మర్త్య మహీరుహ సుధాబ్ధి మహికా ఘృణికిన్
శౌర్త్యవదరి కరి సృణికిన్
మూర్త్యంబా గర్భశుక్తి ముక్తామణికిన్ 63

క. అఘటన ఘటనా చాతు
ర్య ఘనోర్జిత కార్య నిర్వహణ ధుర్వహ ధీ
మఘ వాచార్యున కచ్యుత
రఘునాథ వసుంధరాధిరా డ్వర్యునకున్ 64

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన విజయ
విలాసంబను శృంగార ప్రబంధమ్మునకుఁ గథాక్రమం బెట్టి దనిన;
నైమిశారణ్య మహర్షులకు రౌమహర్షణి యిట్లని చెప్పం దొడంగె. 65

# ప్రథమాశ్వాసము



## ఇంద్రప్రస్థపురీ వైభవము

శా. చంద్రప్రస్తర సౌధ ఖేలనపర శ్యామా కుచ ద్వంద్వ ని
స్తంద్ర ప్రత్యహ లిప్త గంధ కలనా సంతోషిత ద్యోధునీ
సాంద్ర ప్రస్ఫుట హాటకాంబురుహ చంచచ్చంచరీ కోత్కరం
బింద్రప్రస్థ పురంబు భాసిలు రమాహేలా కళావాసమై. 1

ఉ. ద్వారక ముద్దుఁజెల్లె లఁట తన్నగరీమణి; సృష్టి యన్నిటం
దేరుగ డైనచో నిదియ నేర్పుల మే రని యెంచి చేసెఁ బో
ధారుణి విశ్వకర్మ; గుఱి దానికి నెక్కడ నీడు లేని సిం
గారము గల్గు టందు వెనుకన్ సృజియింపక యుండుటే సుమీ. 2

క. వెండియుఁ బైఁడియుఁ దడఁబడు
చుండుం బురి నెందుఁ జూడ; నుగ్రాణములై
యుండంగా వలె నందలి
యిండులఁ గైలాస మేరు పృథ్వీధరముల్. 3

సీ. తడఁబాటు గలదు వేదముల నాతని కంచుఁ బరమేష్ఠి మెచ్చరు ధరణిసురులు;
కడమాటు పగవానిఁ గని చేమఱచె నంచు భార్గవు మెచ్చరు బాహుజనులు;
పనికి రా కొకమూలఁ బడియె నాతనివస్తు లని కుబేరుని మెచ్చ రర్యజనులు;
వీటిపా టైన నాఁగేటి పాటున నేమి యని హలాయుధు మెచ్చ రంఘ్రిభవులు;

తే. పాడి దప్పక, ధర్మంబు పట్టువిడక, లక్షలకు నమ్మఁ జాలి, నల్గడల భూమి
వరులు మే లనఁ దగి, యిట్లు పురిఁ బొలుతురు చదువు సాముల ధన ధాన్య సంపదలను. 4

ఉ. 'నీ సరి యైన దేవతటినిన్ గలఁగించెద నీ వడంపుమా
నాసరి శేషపన్నగ ఫణానివహంబు' నటంచు నప్పురిన్
బాసలు సేసికొన్న వన భాసిలు సాలశిఖాళి ఖేయముల్
మోసమె యైన విష్ణుపదమున్ బలిపీఠము ముట్ట నేటికిన్? 5

ఉ. రే లమృతాంశులో శశము రెమ్మద మంచుఁ దలంచి జాళువా
మేలి పసిండి సోయగపు మేడల గుజ్జెనగూళ్ళ సందడిన్

బాలిక లుండి, యావలఁ జనం గని చింతిలి వంటయింటి కుం
దే లిది యెందుఁ బోఁగలదు నేఁటికి నే' మని యందు రందులన్. 6

ఉ. పున్నమరేలఁ దత్పురము పొంతనె పో శిఖరాళి దాఁకి, వి
చ్ఛిన్నగతిన్ సుధారసము చింది పయిన్ దిగువాఱ నంతనుం
డి న్నెల సన్నగిల్లు; నది నిక్కము గా దనిరేని యా పదా
ర్వన్నె పసిండి మేడలకు రాఁ బని యే మిల సౌధనామముల్? 7

ఉ. వేడుక నప్పురీహరుల వేగముఁ గన్గొని లేళ్ళు గాడ్పుతోఁ
గూడి చనన్ వలెన్ మనము; గూడఁగ నోపక యోడినట్టి వా
రోడనివారి మోచు టని యొద్దికఁ బందెము వైచి కూడలే
కోడెనొ కాక, మోయఁగఁ బ్రయోజన మే మనిలున్ గురంగముల్? 8

ఉ. చుట్టును గట్టియుండు నొకచో నెడ మించుక లేకయుండఁ ద
త్పట్టణ బాహ్యభూముల మదావళ మండల మేమి చెప్ప! ని
ట్టట్టుఁ దెమల్పరా కరి భయంకర మై దివితోడ రాయు; నౌఁ;
బెట్టనికోట గాదె గజబృందము లెందును రాజధానికిన్. 9

ఉ. గాళకు లాపురీ భటశిఖామణు లెక్కటి యుక్కుతున్క; లా
భీలత రాశనుల్ చిదిమి పెట్టిన బంటులు వైరి కెల్ల; బే
తాళుఁడు వచ్చి డగ్గఱిన దబ్బర గా దొకదెబ్బ తీయఁగాఁ
జాలుదు; రేమి చెప్ప మఱి సాదన నేటును సాహసంబునున్. 10

సీ. ఆరామ సీమలయందు నుండి పవళ్లు ముదమెసంగ వసంతుఁ డెదురుచూచు;
మునిమాపుకడలఁ గ్రొన్ననవింటి నెఱజోదు కేళిమందిరముల కెలనఁ జూచుఁ;
బ్రొద్దు వోయిన వేళ రోహిణీప్రాణేశుఁ డుదిరి మేఁడల మీఁద వెదకి చూచుఁ;
దెలతెలవాఱంగ మలయ గంధవహుండు సోరణగండ్లలోఁ జొచ్చి చూచు;
తే. నా పురి విలాసవతుల యొయ్యారములకుఁ గడు సొగసి, వారి రాకలు కాచి కాచి
విరహులఁ గలంచువారె యివ్విధము గాఁగ నున్నవారల నిఁక వేఱె యెన్న నేల? 11

క. మగవానిని మగవాఁడును,
మగువను మగువయును వలచు; మఱి యే మన న
న్నగరపు రాజకుమారుల
జిగిబిగి సోయగము, చెలుల సింగారంబుల్! 12

చ. పొలయలుకల్ వహించి, వలపుల్ మొలిపించు పిసాళి గబ్బి గు
బ్బల జవరాండ్రు మై గగురుపాటున 'నేటికి వచ్చెనమ్మ? యీ
పిలువనిపేరఁటం' బనుచు బెగ్గిలి, నాథులఁ గౌఁగిలింపఁగాఁ
బొలుపుగ నందుఁ బెండ్లి నడుపుల్ నడుచున్ వలినాలి తెమ్మెరల్. 13

ఉ. ప్రాయపు నాయకుల్ వెల నెపాన నెగాదిగఁ జూడ నెర్పు లౌ
రా యివి దండ మీఁద గొసరం దొరఁకొంటిరి; మంచి సాములే
పో యటు లైనచో సరసముల్ గద మీ కిపు!' డంచు నప్పురిన్
గాయజు తూపు లమ్ముదురు కందువ మాటలఁ బుష్పలావికల్. 14

సీ. గొప్పలై మిన్నందు చప్పరా లెక్కి లాఁ గులు వైచుచోఁ జంద్రకళ లనంగఁ,
గనకంబు వర్షించు ఘనుల మ్రోల నటించి మెఱయుచోఁ దొలకరి మెఱపు లనఁగ,
మాటికిఁ జూపర మది కాస గొల్పుచోఁ బ్రతిలేని బంగారు ప్రతిమ లనఁగఁ,
గుపిత నాథులఁ గూర్మిఁ గొసరు జంకెన నాటఁ గనుచో మరు శిలీముఖము లనంగఁ,

తే. జెలఁగి యింపుగ నగఁ, బాడఁ, జెప్పఁ, జదువ, వలవ, వలపింప నేర్చిన యలరుఁబోండ్లు
విపుల భరత కళాశాస్త్ర నిపుణ లైన బిరుదుపాత్రలు గలరు తత్పురమునందు. 15

సీ. అతివినోదము గాఁగ రతుల మెప్పించు నీ పచ్చల కడియాల పద్మగంధి;
చక్కెర మో విచ్చి చవులఁ దేలించు నీ ముత్యాల కమ్మల మోహనాంగి;
తృణముగా లోఁజేయు నెంతటివాని నీ నీలాల ముంగఱ నీలవేణి;
వెలలేని పొందిక విడివడి మెఱయు నీ కెంపులబొగడల కీరవాణి;

తే. యనుచుఁ దమలోన నెఱజాణతనము మీఱ, వారకాంతామణుల మేలు వార్త లెల్లఁ
దెలుపుచును వెన్నెల బయళ్ళఁ గలసి నగుచు విటులు విహరింతు రప్పురి వీథులందు. 16

తే. పోఁక మ్రాఁకుల మహిమ, కప్పురపు టనఁటి
యాకుఁదోఁటల సౌభాగ్య మందె కలదు;
ప్రబలు మౌక్తిక సౌధ సంపదల గరిమ
వీటి రహి మెచ్చ వలయుఁ బో వేయు నోళ్ళ .17

ఉ. ఆణి మెఱుంగు ముత్తెపు టొయారపు ముగ్గులు, రత్నదీపికా
శ్రేణులు, ధూపవాసనలు, హృద్య నిరంతర వాద్య ఘోషముల్
రాణఁ బొసంగఁ బ్రోలు మిగులన్ గనువిం దొనరించు నిత్య క
ల్యాణముఁ బచ్చతోరణమునై జను లందఱు నుల్లసిల్లంగన్. 18

## ధర్మరాజు ధర్మ పరిపాలనము

ఉ. ఆ పుర మేలు 'మేలు! బళి!' యంచుఁ బ్రజల్ జయవెట్టుచుండ నా
జ్ఞా పరిపాలన వ్రతుఁడు, శాంతి దయాభరణుండు, సత్య భా
షా పరతత్త్వకోవిదుఁడు, సాధుజనాదరణుండు, దాన వి
ద్యా పరతంత్రమానసుఁడు ధర్మతనూజుఁ డుదగ్రతేజుఁడై. 19

శా. దేవ బ్రాహ్మణ భక్తి ప్రోవు, ప్రియ వక్తృత్వంబు కాణాచి, వి
ద్యావైదుష్యము దిక్కు, ధర్మమునకున్ దార్కాణ, మర్యాదకున్
ఠా, వౌచిత్యము జీవగఱ్ఱ, హిత శిష్ట వ్రాత సంతోషణ
శ్రీ వజ్రాంగి యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే చూడఁగన్! 20

సీ. అవలఁ బోయిన వెన్క నాడు టెన్నఁడు లేదు, మొగము ముందఱ నంట మొదలె లేదు,
మనవి చెప్పినఁ జేయకునికి యెన్నఁడు లేదు, కొదవగా నడుపుట మొదలె లేదు,
చనవిచ్చి చౌక చేసినది యెన్నఁడు లేదు, పదరి హెచ్చించుట మొదలె లేదు,
మెచ్చినచోఁ గొంచె మిచ్చు టెన్నఁడు లేదు, మొక మిచ్చకపు మెచ్చు మొదలె లేదు,
తే. మఱియుఁ దొల్లిటి రాజుల మహిమ లెన్న నితఁడె పో సార్వభౌముఁ డప్రతిముఁ డనఁగఁ
బ్రజలఁ బాలించె సకల దిగ్భాసమాన కీర్తి విసరుండు పాండవాగ్రేసరుండు. 21

సీ. ఎంత లెస్సగ నున్న నంత వేడుకె కాని ప్రజల కల్మి కసూయపడుట లేదు;
తనుఁ గొల్వవలె నంద ఱను ప్రియంబే కాని మానిసి వెగ టించుకైన లేదు;
నిచ్చ వేఁడిన నర్థి కిచ్చు చిత్తమె కాని మును పింత యిచ్చితి ననుట లేదు;
రే వగల్ ధర్మ మార్జించు దృష్టియె కాని న్యాయంబు తప్పిన నడక లేదు;
తే. 'కలఁడె యిటువంటి రాజు లోకమున నెందు? జలధి వలయిత వసుమతీచక్ర మెల్ల
నేలవలె శాశ్వతముగాఁగ నీ ఘనుండె; యేల వలె నన్య?' లన నా నృపాలుఁ డలరు. 22

ఉ. కోప మొకింత లేదు; బుధకోటికిఁ గొంగుఁబసిండి; సత్యమా
రూపము; తారతమ్యము లెఱుంగు; స్వతంత్రుఁడు; నూతనప్రియా
టోపము లేని నిశ్చలుఁ డిటుల్ కృతలక్షణుఁడై చెలంగఁగా
ద్వాపర లక్షణుం డనఁగ వచ్చునొకో యల ధర్మనందనున్. 23

క. దుర్జయ విమతాహంకృతి
మార్జన యాచనక దైన్య మర్దన చణ దోః
ఖర్జులు గల రతనికి భీ
మార్జున నకుల సహదేవు లను ననుజన్మల్. 24

క. పంచామర తరులో! హరి
పంచాయుధములొ! గిరీశు పంచాస్యములో!
యంచున్ సకల జనంబులు
నెంచన్ బాండవులు వెలసి రేవురు ఘనులై. 25

చ. ఒరిమయు, భక్తియున్, నెనరు, నోర్పుఁ గనంబడఁ బెద్ద పిన్న యం
తరువు లెఱింగి, మాట జవదాఁటక, చెయ్వుల వేఱు లేక, యొం
డొరుల మనమ్ములో మెలఁగుచుండిరి 'పాండు కుమారు లెంత నే
ర్పరు? లిల నన్నదమ్ముల సరాగము వారలదే సుమీ!' యనన్ 26

## అర్జునుని సౌశీల్యాదులు

ఉ. అన్నలపట్లఁ, దమ్ముల యెడాటమునన్ సముఁ డంచు నెన్నఁగా
నెన్నిక గన్న మేటి, యెదు రెక్కడ లేక నృపాల కోటిలో
వన్నెయు వాసియున్ గలిగి వర్తిలు పౌరుషశాలి సాత్త్వికుల్
దన్ను నుతింపఁగాఁ దనరు ధార్మికుఁ డర్జునుఁ డొప్పు నెంతయున్ 27

చ. అతని నుతింప శక్యమె? జయంతుని తమ్ముఁడు సోయగమ్మునన్
బతగ కులాధిప ధ్వజుని ప్రాణసఖుండు కృపారసమ్మునన్,
క్షితిధర కన్యకాధిపతికిన్ బ్రతి జోదు సమిజ్జయమ్మునం,
దతని కతండె సాటి చతురబ్ధి పరీత మహీతలమ్మునన్ 28

తే. పాఱఁ జూచినఁ బరసేన పాఱఁ జుచు,
వింటి కొరగిన రిపురాజి వింటి కొరగు,
వేయు నేటికి? నల పాండవేయు సాటి
వీరుఁ డిల లేఁడు; ప్రతి రఘువీరుఁ డొకఁడె. 29

క. అతిలోక సమీక జయో
న్నతిచే ధర్మజున కింపొనర్చుచు వినయా
న్వితుఁడై సమస్తజన స
మ్మతుఁడై నరుఁ డుండె నిటు లమానుష చర్యన్ 30

ఉ. అంతట నొక్కనాఁడు గదుఁడన్ యదువంశభవుండు రుక్మిణీ
కాంతుఁడు కూరిమిన్ బనుపఁగాఁ, గుశలం బరయంగ వచ్చి, యే
కాంతపువేళ ద్వారవతి యందలి వార్తలు దెల్పుచున్ దటి
త్కాంతి మనోహరాంగు లగు కన్నెల చక్కఁదనంబు లెన్నుచున్ 31

## గదుఁడు గావించిన సుభద్రా సౌందర్య ప్రశంస

పంచచామరము. కనన్ సుభద్రకున్ సమంబు గాఁగ నే మృగీ విలో
కనన్; నిజంబు గాఁగ నే జగంబునందుఁ జూచి కా
కనన్; దదీయ వర్ణనీయ హావ భావ ధీ వయః
కన న్మనోజ్ఞ రేఖ లెన్నఁగాఁ దరంబె గ్రక్కనన్? 32

ఉ. ప్రాయపుఁ డెక్కునన్ జెలువ పల్కులు చిల్కల గారవించుఁ; గ
న్నోయి చకోరపాళి దయతోఁ బెనుచున్; జనుకట్టు మచ్చిక
ల్సేయు సదా రథాంగ యుగళిన్; నడ లంచల బుజ్జగించు; నౌ
నే యెడ నింపు గావు గణియింప నవీన వయో విలాసముల్? 33

చ. అతివ కుచంబులున్, మెఱుఁగుటారును, వెనలియున్, ధరాధిపో
న్నతియు, నహీనభూతి కలనంబు, ఘనాభ్యుదయంబు నిప్పు డొం
దితి మని మాటిమాటికిని నిక్కెడు, నీల్గెడు, విఱ్ఱవీఁగెడున్;
క్షితి నటు గాదె యొక్కొకరికిన్ నడమంత్రపుఁ గల్మి కల్గినన్! 34

సీ. కేళికా సరసిలోఁ దేలియాడుటఁ జేసి శైవాల లత కొంత సాటి వచ్చుఁ;
బుష్పమాలికలతోఁ బొందు సల్పుటఁ జేసి యెలదేఁటి గమి కొంత యీడు వచ్చుఁ;
గంటి కింపగు రేఖ గల్గియుండుటఁ జేసి మినుకుఁ గాటుక కొంత దినుసు వచ్చుఁ;
బిఱుఁద నొయ్యారంబు మెఱయుచుండుటఁ జేసి చమరి వాల మొకింత సమము వచ్చుఁ;
తే. గాక నీలత్వమున సరి గావు తెలియ నెఱి గలిగి, యొక్క మొత్తమై, నిడుదలై, ద
ళమ్ములై, మెర్గు లై, కారు క్రమ్ముచున్న వికచకమలాక్షి నును సోగ వెండ్రుకలకు. 35

ఆ. నలిన లీల సంచు నలినలి గావించు
నించుమించు లాడు నించు మించు
లేమ నగవుఁజూపు లేమన నగు బాపు!
జగ మెఱుంగు దాని జగ మెఱుంగు 36

చ. జలరుహ గంధి వీనుల పసల్ నవసంఖ్య నదేమి లెక్కనున్;
జెలువ నఖాంకురాళి నెల చేడియ సైకముఁ దాను చుక్కనున్;
బొలఁతుక గబ్బి చన్నుఁగవ పువ్వుల చెండ్లను లేదు బంతనున్;
గలికి ముఖారవింద మల కల్వలరాయనిఁ ద్రోసి రాజనున్ 37

క. అయ్యారే చెలు వెక్కడ?
న య్యారే గెలువఁ జాలు నంగజు నారిన్
వెయ్యాఱులలో సరి లే
రయ్యా రుచిరాంగరుచుల నయ్యంగనకున్. 38

క. కడు హెచ్చు కొప్పు; దానిన్
గడవన్ జనుదోయి హెచ్చు; కటి యన్నిటికిన్
గడు హెచ్చు; హెచ్చులన్నియు
నడుమే పసలేదు గాని నారీమణికిన్ 39

ఉ. అంగము జాళువా పసిఁడి యంగము; క్రొన్నెలవంక నెన్నొసల్;
ముంగురు లింద్రనీలముల ముంగురు; లంగజు డాలు వాలుఁ జో
పుంగవ; యేమి చెప్ప నృపపుంగవ! ముజ్జగ మేలఁజేయు న
య్యంగనఁ బోలు నొక్క సకియున్ గన; నెన్నఁగ మించు నన్నిటన్ 40

ఉ. ఎక్కడఁ జెప్పినాఁడఁ దరళేక్షణ చక్కఁదనమ్ము? నింక న
మ్మక్క! యదే మనంగ నిపు డందు శతాంశము దెల్పలేదు నే;

నొక్కొకయంగ మెంచవలయున్, బదివేల ముఖంబు లాయెఁబో;
చొక్కపుఁ జూపులో సొలపు చూచినఁ గాక యెఱుంగ వచ్చునే 41

చ. అని బహుభంగులం బొగడ నంగన ముంగల నిల్చినట్లుఁ దాఁ
గనుగొనినట్లునై నృపశిఖామణి డెందమునందుఁ బట్టఁజా
లని యనురక్తి 'నవ్వర విలాసిని నెన్నఁడు చూడఁ గల్గునో'
యని తమకించుచున్న సమయంబున గ్రక్కున దైవికంబునన్. 42

## సమయభంగమునకై యర్జునుఁడు తీర్థయాత్ర కేఁగుట

మ. ఒక భూమీదివిజుండు చోరహృత ధేనూత్తంసుఁడై వేఁడికొం
టకుఁ రా ధర్మజు కేళిమందిరము దండం బోయి కోదండ సా
యకముల్ దెచ్చుటఁ బూర్వక్లప్త సమయ న్యాయానుకూలంబుగా
నొక యేఁ డుర్వి ప్రదక్షిణం బరుగు నుద్యోగంబు వాటిల్లినన్ 43

ఉ. అన్నకు మ్రొక్కి, 'తీర్థ భజనార్థముగాఁ బనివిందు' నంచుఁ దా
విన్నప మాచరించుటయు, 'విప్రహితంబున కన్న ధర్మమే
మున్నది? గోప్రదక్షిణమె యుర్వీప్రదక్షిణ' మంచు నిట్టు లే
మన్నను మాన కన్నరుఁడు ప్రార్థన సేయఁగ నెట్టకేలకున్ 44

చ. తనదు పురోహితుం డయిన ధౌమ్యుని తమ్ముని గారవంపు నం
దనుని విశారదున్ సకలధర్మ విశారదు వెంట నంటఁగా
నొనరిచి, కొందఱన్ బరిజనోత్తములన్నియమించి, యాదరం
బెనయ సమస్త వస్తువులు నిచ్చి యుధిష్ఠిరుఁ డంపె వేడుకన్ 45

చ. పరిణయ మౌట కేఁగుగతిఁ బౌరు లనేకులు వెంటరా శుభో
త్తరముగ నయ్యెడన్ గదలి, తద్దయుఁ దాలిమి మీఱ ధర్మత
త్పరుఁడయి, యందు నందు నులుపాలు నృపాలు రొసంగఁగా నిరం
తరమును బుణ్యతీర్థములఁ దానము లాడుచు నేఁగి యవ్వలన్ 46

## అర్జునుఁడు గంగాభవానిని నుతించుట

భుజంగ. సునాసీర సూనుండు చూచెన్ నిమజ్జ
జ్జనౌఘోత్పత త్పంక శంకాక రాత్మో
ర్మి నిర్మగ్న నీరేజ రేఖోన్నమ ద్భృం
గ నేత్రోత్సవ శ్రీని గంగా భవానిన్. 47

క. సంతోష బాష్ప ధారలు
దొంతరగాఁ జూచి, మ్రొక్కి, తోయధి వరసీ
మంతిని, నా త్రిజగ ద్దీ
వ్యంతిని, భాగీరథీ స్రవంతిని బొగడెన్ 48

శా. తా సైరింప కపర్ది యుండఁగ భవ ద్గర్భంబునన్ దాల్చి, తే
జోఽసహ్యన్ శరజన్ముఁ గాంచి, యల నీహార క్షమాభృత్కుమా
రీ సాపత్న్యముఁ గన్న మోహపుఁ బురంధ్రీరత్నమౌ దీవ కా
దే; సర్వజ్ఞుఁడు నిన్ను నేల తలపై నెక్కించుకో జాహ్నవీ! 49

క. పెల్లు సెగఁ జల్లు విస మా
తెల్లని దొర కుతికమోవఁ దివి బ్రతుకుట నీ
చల్లఁ దనంబునఁ గాదే?
కల్లోలవతీమతల్లి! గంగమ తల్లీ! 50

క. పువ్వారుఁబోఁణివై, సరి
యెవ్వా రన, భీష్ముఁ గాంచి యిం పొందితి వీ;
వవ్వావి యెఱుఁగుదువె? మా
యవ్వా! పోషింపఁ బాడి యగు నను నీకున్. 51

చ. సకల శుభమ్ము లిమ్మనుచు సన్నుతు లీగతిఁ జేయు నా స్రవం
తిక దయఁ దెల్పఁ బంచిన గతిం జనుదెంచె నుదంచ దూర్మికా
నికర విలోల ఖేల దళినీ కలగాన లసత్ప్రఫుల్ల హ
ల్లక సుఖడోలికా విహృతి లాలస బాలసమీర మయ్యెడన్ 52

క. చనుదెంచిన హో! యని, య
జ్జననాయకుఁ డలరుచున్ విశారదుఁ గని, "యీ
యనుకూల మారు తాగతిఁ
గనుఁగొన నామోద సూచకం బైనదిగా 53

క. తల నీ గంగాతీర్థము
చిలికినవాఁ డీశ్వరుండు; చేరెడు లోఁ గోఁ
గలిగినఁ, దరఁగలఁ దేలం
గలిగినఁ దన్మహిమ లెన్నఁగాఁ దర మగునే? 54

క. మునుకలు గంగానదిలో
నొనరించుటకన్న భాగ్య మున్నదె?" యనుచున్
మును కలుగంగా దిగి పరి
జనములు కైలా గొసంగ స్నానోన్ముఖుఁడై 55

క. తమి నిగుడ గుడాకెశుం
డమరనదీ విమలవారి నాడుచు నుండన్
యమునానదిఁ గూడిన తో
యమునా నది తనరెఁ దత్కచామేచకమై 56

ఉ. దానము లెన్నియే నచటి త్రైర్థిక భూసుర సంఘు మెల్ల డెం
దాన ముదంబు చెందఁగ నొనర్చి, దృఢవ్రతచర్య నిత్యమున్
దానము చేయుచున్, హరికథా శ్రవణం బొనరించుచుండె నం
దా నముచిద్విషత్తనయుఁ డాశ్రిత కల్పమహీరుహం బనన్ 57

గంగా తీరమున నాగకుమారి యులూచి యర్జునుని గాంచి మరులు గొనుట

క. భోగవతి నుండి యెప్పుడు
భాగీరథి కడకు వచ్చి భాసిలు మున్నే
నాగకుమారిక యయ్యెల
నాగ యులూచి తమి నొక్కనాఁ డటఁ జెంతన్ 58

ఆ. హిమ రసైక సైకతమునందు విహరించు
కైరవేషు వేషు ఘన నిభాంగు
నెనరు దవుల దవులనే చూచి క్రీడిగా
నెఱిఁగి యౌర! యౌర గేందువదన 59
క. మును ద్రౌపదీ స్వయంవర
మున కేఁగిన కామరూప భోగులవలనన్
వినియున్న కతనఁ దమకము
మనమునఁ బెనఁగొనఁగఁ జేరి మాయాన్వితయై 60

ఉ. గుట్టసియాడ గబ్బి చను గుట్టలపైఁ బులకాంకురావళుల్
తెట్టువ గట్టఁ, గోరికలు తేటలు వెట్టఁగ, వేడుకల్ మదిన్
దొట్టికొనంగ, నచ్చెరువు తొంగలి ఱెప్పల వీఁగ నొత్తఁగాఁ
బెట్టిన దండ తీయక విభీత మృగేక్షణ చూచె నాతనిన్ 61

క. ఏణాక్షి నపుడు వెడ సిం
గాణిన్ గొని యలరుఁ దూపుగమిఁ జక్కెరయే
ఖాణముగాఁ గలిగిన కం
ఖాణపు దొర పింజపింజ గాడఁగ నేసెన్ 62

ఉ. పై పయిఁ గౌతుకంబు దయివాఱె యిటుండఁగ నంత మజ్జనం
బై పువుఁ జప్పరమ్మున నొయారముగాఁ గయిసేసి, దానలీ

లా పరతంత్రుఁడై కలకలన నగుచుండెడి సవ్యసాచి, నిం
ద్రోపలరోచిఁ జూచి, తలయూఁచి యులూచి రసోచితంబుగన్. 63

## ఉలూచి యర్జునుని సోయగమును మెచ్చుట

క. "సిగ సంపెఁగ పూ, లొసపరి
వగ, కస్తురి నామ, మొఱపు వలెవా టౌరా!
సొగ సిటు లుండఁగ వలె"నని
సొగసి, లతాతన్వి యతని సొగసు నుతించెన్ 64

క. రాకొమరు నెఱులు నీలపు
జూకొమరు నిరాకరించు; రాకాచంద్రున్
రాకొట్టు మొగము; కెంజిగు
రాకుఁ గని పరాకు సేయు నౌర పదంబుల్! 65

ఉ. తీరిచినట్టు లున్నవి గదే కనుబొమ్మలు; కన్ను లంటిమా
చేరలఁ గొల్వఁగా వలయుఁ; జేతుల యందముఁ జెప్ప గిప్ప రా;
దూరులు మల్చివేసినటు లున్నవి; బాపురె! ఔమ్ములోని సిం
గారము, శేషుఁడే పొగడఁగావలె నీతని రూపరేఖలన్. 66

క. అకటా! న న్నితఁ డేలిన
నొకటా? నచ్చికము లేక యుండఁగ వచ్చున్
నికటామృత ధారలు మరు
ని కటారి మెఱుంగు లీతని కటాక్షంబుల్ 67

ఉ. ఆ దరహాస చంద్రికల యందము, నాప్తులమీఁదఁ జిల్కు న
త్యాదర శీతలేక్షణ సుధారస ధారయుఁ జూడఁ జూడ నా
హ్లాదము గొల్పఁగాఁ గల కలా మహిమంబుఁ దలంచి చూచిన
న్మాదిరి సేయవచ్చు జననాథు మొగంబును జంద్రబింబమున్ 68

ఉ. ఊఁదుకపోవు శంఖము నహో గళరేఖ! శరాసనంబులన్
వాదుకుఁ బట్టుఁ గన్బొమల వైఖరి; వంకలు దీరుచున్ గటా
క్షోదయలీల సాయక సమూహములన్; విషమాస్త్రుఁ గెల్చుఁబో;
యే దొర సాటి యీ నరున కెన్నఁగ వీరవిలాస సంపదన్? 69

ఉ. కమ్మని జాళువా నొరయఁ గల్గిన చెక్కుల టెక్కువాఁడు, చొ
క్కమ్మగు జాతికెంపు వెలగాఁ గొను మోవి మెఱుంగువాఁడు, స
త్యమ్మగు రూప సంపద ధనాధిపసూనుని ధిక్కరించువాఁ
డమ్మక చెల్ల! నా హృదయ మమ్మక చెల్లదు వీని కియ్యెడన్ 70

సి. ముద్దాడ వలదె యీ మోహనాంగుని మోము గండ చక్కెర మోవి గల ఫలంబు?
రమియింపవలదె యీ రమణు పేరురముపై వలి గుబ్బ పాలిండ్లు గల ఫలంబు?
శయనింపవలదె యీ ప్రియుని సందిటిలోనఁ గప్పు పెన్నెఱికొప్పు గల ఫలంబు?
వసియింప వలదె యీ రసికు నంకమునందుఁ జెలువంపు జఘనంబు గల ఫలంబు?
తే. రాజసము తేజరిల్లు నీ రాజుఁ గూడి యింపు సొంపులు వెలయఁ గ్రీడింప వలదె
నాకలోకంబు వారికి నైన లేని యలఘుతర భోగభాగ్యముల్ గల ఫలంబు 71

క. అని యిటు లువ్విళ్లూరెడు
మనమునఁ గొనియాడి యంత మాపటి వేళన్
గనుఁబ్రామి, చొక్కుఁ జల్లిన
యనువున నందఱు వితాకులై యుండంగన్. 72

చ. "ఇటు జపియించినన్ విడుతునే నిను నేనిఁక" నంచు జాహ్నవీ
తటమున సంధ్యవార్చి జపతత్పరుఁడై తగువాని యామినీ
విటకుల శేఖరున్ గొనుచు వే పురికిన్ జని నిల్పె నట్టెయు
న్నటులనె మాయ యచ్చుపడ నల్ల భుజంగి నిజాంగణంబునన్ 73

క. నిలిపిన జప మెప్పటివలెఁ
జలిపినవాఁ డగుచుఁ బాకశాసని యంతన్
దళుకుం బిసాళి వాలుం
దెలి గన్నులు విచ్చి చూచె నివ్వెఱతోడన్ 74

## భోగవతిలో నర్జునుఁడు ఉలూచి విభ్రమము చూచి సంభ్రమాశ్చర్యముల నొందుట

సీ. దట్టంపుఁదెలి నీటి తరఁగచాల్ కడ కొత్తి నెలజాల జగతిఁ దా నిలుచు టేమి?
కొలఁకుఁ దెమ్మెర గందములఁ గ్రిందఁ బడవైచి కపురంపుఁ దావిఁ దాఁ గవియు టేమి?
చివురు జొంపపు మావి జీబు మాయము సేసి పసిఁడి యుప్పరిగఁ దాఁ బ్రబలు టేమి?
నిద్దంపు టిసుము తిన్నియ పాన్పు దిగ ద్రోచి యలరుల పాన్పుఁ దా హత్తు టేమి?
తే. మసమసక సంజ కెంజాయ మఱుఁగువెట్టి మిసిమి కెంపుల కాంతిఁదా మెఱయు టేమి?
మొదల నే గంగతటి నున్న యదియు లేదొ మాయయో కాక యిది? యంచు మరలిఁజూడ
75

సీ. బెళుకుఁ గాటుకకంటి సొలపుఁ జూ పెదలోనఁ బట్టియుండెడి ప్రేమఁ బట్టి యీయఁ
జికిలి బంగరుప్రాఁత జిలుగు టొయ్యారంపుఁ బైఁట గుబ్బల గుట్టు బైటవేయ
సొగసుఁ గుచ్చెల నీటు వగలు కన్నుల పండు గలుగ మాయపుఁ గొనుఁ గలుగఁజేయ
నిడుద సోగ మెఱుంగు జడకుచ్చు గరువంపుఁ బిఱుఁదు రేఖకు గెల్పుబిరుదు చాటఁ
తే. గంటసరి నంటు కస్తురి కమ్మవలపు కప్పురపు వీడియపుఁ దావి గలసి మెలఁగ
నొఱపులకు నెల్ల నొజ్జయై యుండె నపుడు భుజగ గజగామిని మిటారి పొలుపు మీఱి 76

క. అటులున్న కొమరుఁ బ్రాయపుఁ
గుటిలాలకఁ జూచి, మదన గుంఫిత మాయా
నటనంబో యది! గంగా
ఘటనంబో! యని విచార ఘటనాశయుఁడై 77

ఉ. తియ్యని వింటివాని వెనుతియ్యక డగ్గఱఁ జాలు నయ్యసా
హోయ్య తనూవిలాసి దరహాసము మీసముఁ దీర్ప నప్పుడా
తొయ్యలి వంకఁ గన్గొని "వధూమణి! యెవ్వరిదాన నీవు? పే
రెయ్యది నీకు? నొంటి వసియింపఁగఁ గారణ మేమి?" నావుడున్ 78

ఉ. మేలి పసిండి గాజుల సమేళపుఁ బచ్చల కీల్కడెంపు డా
కేలు మెఱుంగు గబ్బి చనుఁగ్రేవకుఁ దార్చుచు సోగ కన్నులన్
దేలగఁ జూచి, "యో మదవతీ నవమన్మథ! యీ జగంబు పా
తాళము; నే నులూచి యనుదాన, భుజంగమరాజ కన్యకన్ 79

క. సరిలేని విలాసము గని
వరియిం చిటఁ దోడికొనుచు వచ్చితి నిన్నో
కురువీర! వసింపఁగ నీ
కుఱువీర దృఢాంకపాళిఁ గోరినదానన్ 80

ఉ. మంపెసఁగన్ గటాక్ష లవమాత్రము చేతనె ముజ్జగంబు మో
హింపఁగఁ జేయు భార మిఁక నీవు వహించితి గానఁ గేళినీ
చంపకగంధి బిత్తరపుఁ జన్నుల మీఁద సుఖించుచుండు నా
సంపెఁగమొగ్గ ముల్కిగడ సామరి సోమరి గాక యుండునే?" 81

క. అను నచ్చెలి వాక్యంబులు
విని యచ్చెరువొంది, "రూప విభ్రమ రేఖా
ఖను లెందు నాగకన్యలె"
యని విందుము; నేఁడు నిక్క మయ్యెన్ జూడన్ 82

క. అన్నన్న! మొగము వెన్నుని
యన్నన్న జయించుఁ; గన్ను లన్నన్ నలినా
సన్నములు; నడుము మిక్కిలి
సన్నము; మాటలు సుధా ప్రసన్నము లెన్నన్ 83

ఆ. నువ్వుఁ బువ్వు నవ్వు జవ్వని నాసిక,
చివురు సవురు జవురు నువిదమోవి,
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతి వేణి,
మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవ మేను 84

క. రవరవలు నెఱపు నిలపు
రవ రవణముతోడఁ జెలి యరాళ కచంబుల్;
కవకవ నవ్వున్ వలి జ
క్కవ కవఁ గలకంఠ కంఠి కఠిన కుచంబుల్ 85

ఉ. చెక్కుల యందమున్, మొగము చెల్వముఁ, జన్గవ నీటు, వేణి తీ
రెక్కుడఁ జూడ; మన్నిటికి నెక్కువ దే మన సైకతంబుతో
నెక్కటి కయ్యముల్ సలుపు నిక్కటి యొక్కటి చాలదే మరున్
డక్కగొనన్ రతిన్ గెలిచి డక్కగొనన్ నవమోహనాంగికిన్ 86

చ. అని మది మెచ్చి యొచ్చె మొకయందును లేని మనోహరాంగముల్
గనుఁగొని, "యౌనెకా! వ్రతము గైకొని యుండెడి నన్ను నేల తో
డ్కొని యిటఁ దెచ్చె నీ వెడఁగుఁ గోమలి? భూజగ మేడ, మారుతా
శనజగ మేడ? యెంత ఘనసాహస మింతుల?" కంచు నెంచుచున్ 87

## ఉలూచి యర్జునుల సరస సంవాదము

క. "కాముకుఁడఁ గాక వ్రతినై
భూమి ప్రదక్షిణము సేయఁ బోయెడి వానిన్
గామించి తోడి తేఁ దగ
వా? మగువ! వివేక మించుకైనన్ వలదా?" 88

ఉ. నావుడు మోమునన్ మొలక నవ్వొలయన్, వలి గబ్బి గుబ్బ చన్
ఠీవికిఁ గాన టించుక నటించు కవున్ గనిపింపఁ బల్కె రా
జీవదళాక్షి "యో రసికశేఖర! యో జన రంజనైక లీ
లావహరూప! యో నుతగుణా! తగునా యిటు లాన తీయఁగన్ 89

క. నిను గీతి సాహితీ మో
హన వాణులు చెవులు వట్టి యాడింపంగాఁ
గని యుండి 'కాముకుఁడ గా'
నని పల్కిన నాకు నమ్మికౌనె నృపాలా! 90

క. అతులిత విలాస రేఖా
కృతులన్ వలపించి యిటులఁ ద్రిభువన లీలా
వతుల నలయించుటేనా
వ్రత మనఁగా నీకు? రూపవంచిత మదనా! 91

చ. తెలియనిదానఁ గాను జగతీవర! ద్రౌపదియందు ముందు మీ
రల సమయంబు సేయుట, ద్విజార్థము ధర్మజు పాన్పుటింటి ముం

గలఁ జని, శస్త్రశాల విలు గైకొను, టందునిమిత్త మివు ని
శ్చలమతి భూప్రదక్షిణము సల్పఁగ వచ్చుట, నే నెఱుంగుదున్ 92

తే. చెఱకువిలుకాని బారికి వెఱచి నీదు
మఱుఁగుఁ జేరితిఁ; జేపట్టి మనుపు నన్నుఁ;
బ్రాణదానంబు కన్నను వ్రతము గలదె?
యెఱుఁగవే, ధర్మపరుఁడవు నృపకుమార! 93

ఉ. నాయమె నీకు మేల్పడిన నాతి నలంచుట? యంత్ర మత్స్యము
న్నాయఁగఁ జేసి మున్ ద్రుపదనందన నేలవె? యంగభూ పతా
కాయత యంత్రమత్స్య మిపు డల్లనఁ ద్రెళ్ళఁగ నేసి యేలుకో
తీయఁగఁ బంచదార వెనుతీయఁగఁ బల్కి ననున్ ద్వితీయఁగన్" 94

క. అనుడు నుడురాజ కులపా
వనుఁడు "సమస్తమ్ము నెఱుఁగు వలఁతివి గద; యీ
యనుచితము తగునె? పరసతి
నెనయుట రాజులకు ధర్మమే యహిమహిళా?" 95

చ. అన విని పాఁప పూప జవరా లెదలో వల పాప లేక, యా
తని తెలిముద్దు నెమ్మొగముఁ దప్పక తేట మిటారి కల్కి చూ
పునఁ దనివారఁ జూచి, "నృపపుంగవ! యన్నిట జాణ; వూరకే
యనవల సంటిగా కెఱుఁగవా యొకమాటనె మర్మకర్మముల్. 96

ఉ. కన్నియఁ గాని వేఱొకతెఁ గాను మనోహరరూప! నీకు నే
జన్నియ పట్టియుంటి నెలజవ్వన మంతయు నేఁటిదాఁక; నా
కన్నుల యాన; నా వలపుఁ గస్తురినామము తోడు నమ్ము; కా
దన్నను నీదు మోవి మధురామృత మానియు బాస సేసెదన్ 97

చ. ఇలపయి మత్స్యయంత్ర మొక యేటున నేసి, సమస్త రాజులన్
గెలిచిన మేలువార్త లురగీ వరగీతిక లుగ్గడింప వీ
నుల నవి చల్లఁగా విని, నినున్ వరియింప మనంబు గల్గి, నీ
చెలువము వ్రాసి చూతు నదె చిత్తరువందు ననేక లీలలన్ 98

ఉ. చెప్పెడి దేమి నా వలపు చేసినచేఁతలు? కొల్వులోన ని
న్నెప్పుడు గంటి నప్పుడ పయింబడ నీడిచె, నిల్వఁ బడ్డ పా
టప్పు డ డెంత యైనఁ గల; దట్టి హళాహళి కింతసేపు నీ
వొప్పెడిదాఁకఁ దాళుట కయో! మది మెచ్చవుగా నృపాలకా!" 99

తే. అనిన "ఫణిజాతి వీ, వేను మనుజజాతి;
నన్యజాతిఁ బ్రవర్తించు టర్హ మగునె?

యెల యీకోర్కి? యనిన రాచూలి కనియెఁ
జిలువచెలువంపుఁ బల్కులఁ జిలువ చెలువ 100

ఉ. "ఏ మనఁ బోయెదన్ దగుల మెంచక నీ విటు లాడఁ దొల్లి శ్రీ
రాము కుమారుఁడైన కుశరాజు వరింపఁడె మా కుముద్వతిన్?
కోమల చారుమూర్తి పురుకుత్సుఁడు నర్మదఁ బెండ్లియాడఁడే?
నీ మన సొక్కటే కరఁగనేరదు గాని నృపాలకాగ్రణీ! 101

ఉ. 'ఈ కలహంసయాన నను నెక్కడి కెక్కడ నుండి తెచ్చె? నా
హా కడుదూర మిప్పు!' డని యక్కునఁ జేర్పక జంపుమాటలన్
వ్యాకులపెట్టు టేల? విరహాంబుధి ముంపక పోదు నన్ జలం
బే కద నీకు, మంచి దిఁక నీఁతకు మిక్కిలి లోఁతు గల్గునే?" 102

చ. అని వచియించునప్పుడు ముఖాబ్జము నంటెడి విన్నఁబాటు, చ
క్కని తెలి సోగ కన్నుఁగవఁ గ్రమ్ముచు నుండెడి బాష్పముల్ గళం
బునఁ గనిపించు గద్గదిక ముప్పిరిగొన్వలవంతఁ దెల్ప ని
ట్లని మదిలోఁ గరంగి రసికాగ్రణి యా కరభోరు భోరునన్ 103

ఉ. "చక్కెరబొమ్మ! నా వ్రతము చందముఁ దెల్పితి; నంతె కాక నీ
చక్కఁదనంబుఁ గన్న నిముసం బయినన్ నిలు పోప శక్యమే
యక్కునఁ జేర్ప?" కంచు దయ నానతి యీఁ, దల వంచె నంతలో
నెక్కడినుండి వచ్చెఁ దరళేక్షణకున్ నునుసిగ్గు దొంతరల్! 104

## అర్జునుఁ డులూచిని సుఖసాగరమునఁ దేల్చుట

ఉ. అంకి లెటెంగి యా సరసుఁ డంత "వివాహ విధిజ్ఞుఁ డైన మీ
నాంకుఁ డొనర్చినాఁ డిది శుభైక ముహూర్తము, ర మ్మటంచుఁ బ
ర్యంకముఁ జేర నచ్చెలిఁ గరగ్రహణం బొనరించెఁ దన్మణీ
కంకణ కింకిణీ గణ వికస్వర సుస్వరముల్ సెలంగఁగన్ 105

మ. ఒక మాణిక్యపు బొమ్మ యెట్టి వగ కీలో జాళువా జాలవ
ల్లిక బాగాల్ కపురంపు టాకుమడుపుల్ వే తెచ్చి రాజున్న చా
యకు నందీయ, నతండు లేనగవుతో నా వేళ నా వ్యాళ క
న్యక కెంగేల నొసంగి కైకొనియె సయ్యాటంబు వాటిల్లఁగన్ 106

ఉ. శయ్యకుఁ దార్పఁగాఁ దుఱుముజాఱెఁ దనంతటఁ జక్కఁదిద్దఁబోఁ
బయ్యెద జాఱె; నయ్యదిరిపాటునఁ గ్రక్కున నీవి జాఱె; రా
జయ్యెడ నవ్విలాసిని యొయారముఁ జూచి కవుంగిలించె; నౌ,
నెయ్యెడ మేలె చూతురు, గ్రహింపరు జాణలు జాఱుపాటులన్ 107

ఉ. కౌఁగిటఁ జెర్చునప్పటి సుఖంబె లతాంగికిఁ బారవశ్యము
న్మ్రాఁగఁగఁ జేసె; మోవి పలునొక్కులు రోజ నఖాంకముల్ మొద
ల్గాఁగల కంతుకేళి సుఖలక్షణముల్ పయిపెచ్చులయ్యె, న
ట్లౌ గద యెట్టి వారలకు నగ్గలపుం దమి గల్గియుండినన్ 108

చ. చనుఁగవ సాముకండెపుఁ బిసాళి యురంబున సారెఁ గాననే
మన సునుచున్; సుధారసము మాటికిఁ గ్రోలనె చూఁచు; జొక్కుఁ గీ
ల్కొను సరసోక్తులన్ వినవె కోరు సదా; యిటు లాదిసంగమం
బుననె విభుండు మూఁడువలపుల్ వలచెన్ ఫణిరాజకన్యకన్ 109

తే. నాగరిక ముద్ర గల మంచి బాగరి యఁట!
నాగవాసములో వింత నటనల దఁట!
కులుకు గుబ్బల ప్రాయంపుఁ గోమలి యఁట!
వలచి వలపింపదే యెంతవాని నైన! 110

## ఇలావంతుని జననము

క. ఈ గతి రతి కేళీ సుఖ
సాగరమునఁ దేలియున్న సమయంబునఁ, ద
ద్యోగం బెటువంటిదొ, స
ద్యోగర్భంబున సుపుత్త్రుఁడొకఁ డుదయించెన్ 111

క. ఆ చక్కని బాఁలుడు వాక్
ప్రాచుర్యముఁ గాంచునని శుభగ్రహ దృష్టుల్
చూచి యిలావంతుండని
యా చతురుఁడు నామకరణ మలరిచి యంతన్ 112

ఉ. కామినిఁ జూచి "రమ్ము గజగామిని! యిక్కడ నొక్కవాఁడిఁకన్
దామస మైన నక్కడ హితవ్రతి తైర్థికకోటి యాత్మలో
నేమని యెంచునో? యిపుడ యేఁగవలెన్, దరువాత నీసుత
గ్రామణి, నీవు వచ్చెదరు గా!" కని యూఱడిలంగఁ బల్కినన్ 113

## ఉలూచి యర్జునునకు వీడ్కోలొసఁగుట

ఉ. అంటిన ప్రేమ జాహ్నవికి నప్పుడ తోడ్కొని వచ్చి, యల్ల వా
ల్గంటి నిజేశ్వరున్ దనదు గబ్బి చనుంగవఁ జేర్చి, బాష్పముల్
కంటఁ దొరంగుచుండఁ దిరుగం దిరుగం గనుఁగొంచుఁ గ్రమ్మఱెన్
జంట దొఱంగి సంజను వెసం జను జక్కవ పెంటియుం బలెన్ 114

ఉ. అంతట రాజురాకఁ గని యాప్త పురోహిత భృత్య వర్గ మ
త్యంత ముదమ్ము చెంది "యిటు లార్తులఁ గాచుట కేమొగాక యే
కాంతము గాఁగ నేఁగుదురె? యంచుఁ దలంచితి; మీరు వచ్చు ప
ర్యంతము మమ్ము మే మెఱుఁగ; మందఱ ప్రాణము లీవ భూవరా!" 115

అర్జునుఁడు తన నెచ్చెలి విశారదునితో నులూచీ ప్రణయ ప్రసంగమును వర్ణించుట

చ. అని పలుకన్ బ్రసన్నముఖుఁడై విభుఁ డిష్టసఖున్ విశారదున్
గని "యొక వింత వింటె! ఫణికన్య యులూచి యనంగ నోర్తు నన్
గొని తమ నాగలోకమునకున్ జని తన్ను రమించు మంచుఁ జె
ప్పని ప్రియ మెల్లఁజెప్పి యొడఁబా టొనరించి కరంచె డెందమున్ 116

ఉ. "చెప్పెడిదేమి! కన్నుఁగవ చేరల కెక్కుడు చంద్రబింబమే
తప్పదు మోము, మోవి సవతా చివు రెక్కడిమాట? గొప్పకున్
గొప్ప పిఱుందు, గబ్బి చనుగుబ్బలు కౌఁగిటి కెచ్చు జాళువా
యొప్పులకుప్ప మేను, నడు మున్నదొ లేదొ యెఱుంగ నింతకున్ 117

ఉ. "చంగున దాఁటు చూపు లిరు చక్కని బేడిస లేమొ? మీటినన్
గ్రంగన వాఁగు గుబ్బలు చొకారపుఁ దాళము లేమొ, రూపమా
నం గననైన చెక్కిళులు నాణెపుటద్దము లేమొ, చొక్క మౌ
రంగున మీఱు దాని యధరంబును గెంపగునేమొ, నెచ్చెలీ! 118

ఉ. ఆ యెలనాగ వేణి మెఱుఁగారు కటారికి మాసటీఁ డగున్
బోయన వచ్చు; నమ్మెఱుఁగుఁబోఁడి పిఱుందు సమస్త భూమికిన్
రాయ లనంగవచ్చు; నల రాజనిభాస్య యెలుంగు గట్టివా
కోయిల కంచుకుత్తికలకున్ బయకాఁ డనవచ్చు నెచ్చెలీ! 119

క. మదిరాక్షి మోవి జిగి ప్రతి
వదనము గావించు గీర వదనముతోడన్
మదనుని విలు గొనవచ్చున్
సుదతీమణి కన్నుబొమల సుద తీరెంచన్ 120

చ. అల జడ యందమున్, మెఱుఁగు టారు మిటారము నాకు ముందుగాఁ
జిలువ కొలం బటంచుఁ జెలి చెప్పక తొల్తనె చెప్పెఁ, దత్తనూ
విలసన మెన్నఁ గన్నదియు విన్నది గా, దిలలో లతాంగు లా
పొలఁతుక కాలిగోరులకుఁ బోలరు, పోలునొ యేమొ తారకల్! 121

సీ. మరుని గెల్పుల కథా మహిమమ్ము విలసిల్లు నొఱపుఁ జిత్తరుతీవి నుల్లసిల్లు
వీనుల కమృతంపు సోనలై వర్తిల్లు శారికా ముఖ సూక్తి సందడిల్లుఁ

గస్తూరికాది సద్వస్తుల బ్రభవిల్లుఁ బరిమళమ్ముల జొకఁ బరిఢవిల్లుఁ
జెప్పఁ జూపఁగ రాని సింగారము ఘటిల్లు పెక్కుశయ్యల సొంపు పిక్కటిల్లు
తే. వింత హరువుల పసులచే విస్తరిల్లు దివ్య మాణిక్య కాంతులఁ దేజరిల్లు
నందముల కెల్ల నందమై యతిశయిల్లుఁ బాఁప జవరాలి బంగారు పడకటిల్లు 122

క. ఆ భోగము, తద్వస్తు చ
యాభోగము నెందుఁగన్నయవి గావు సుమీ!
నాభోగపురము సరి యౌ
నా భోగవతీ పురంబు సార్థంబయ్యెన్ 123

ఉ. ఆ మదిరాక్షి భోగవతి యన్ నదిఁ గ్రుంకఁగఁజేసి, తత్పుర
స్సీముని హాటకేశ్వరు భజింప నొనర్చిటు తోడి తెచ్చి న
న్నీ మహి నిల్పి యేఁగె నిదె యిప్పుడె; నన్నెడఁబాయలేని యా
ప్రేమది యింత యంత యని పేర్కొనరా" దని తెల్పెఁ; దెల్పినన్ 124

ఉ. మౌఖరి మించ నిట్టులను మంత్రిశిఖామణి "చోద్య మయ్యె నా
వైఖరి విన్న నే మనఁగవచ్చు? నహో! మనుజేంద్ర చంద్రమ
శ్శేఖర! చిల్వరా కొలము చేడియ నొక్కతెఁ జెప్పనేల? నీ
రేఖఁ గనుంగొనన్ వలవరే ఖచరీ ముఖ సుందరీమణుల్?" 125

క. అని పలుక నలరి బలరిపు
తనయుండటఁ గదలి మొదలి తైర్థికులను దా
నును మంచుఁగొండ యుండకుఁ
జని తచ్ఛిఖరావలోక జనితాదరుఁడై 126

## అర్జునుని యనంతర తీర్థయాత్రా ప్రకారము

సీ. పదియాఱు వన్నె గుబ్బలి రాచకూఁతురు పట్టంపు రాణిగాఁ బరఁగు జాణ
పతి యర్ధదేహంబు సతి యంట నిజముగాఁ బ్రబలు కన్నియఁ గన్న భాగ్యశాలి
ముజ్జగమ్ముఁ బవిత్రముగఁజేయు తీర్థమ్ముఁ గొనసాగఁ జేసిన యనఘమూర్తి
భూమిధరారాతిచే మొక్క వోవని యరిది బిడ్డను గాంచినట్టి మేటి
తే. యోషధుల మొలపించిన యుత్తముండు చల్లఁదనముల కెల్ల దీక్షాగురుండు
సకల మాణిక్య రాశికి జననసీమ యా నగస్వామి సద్గుణాస్థానభూమి 127

వ. అని బహుప్రకారమ్ముల హిమగిరి ప్రభావమ్ము వక్కాణించుచుఁ దత్ప్రదేశంబున
శాఖాశిఖోల్లిఖిత గ్లావృక్షం బగు నగస్త్య వట వృక్షంబుఁ గనుంగొని, యచట నికట విశంకట
కటక కమనీయ మణిశృంగంబగు మణిశృంగంబుంగని, యగణ్య పుణ్యాగమ సమర్థంబగు
హిరణ్యబిందు తీర్థమ్మునఁ గృతావగాహుండై, గోహిరణ్య ధరణ్యాది దానమ్ము లనేకంబులు

గావించి, ప్రాగ్భాగమున కరిగి, యనెక పట్టణారణ్య గిరి సమూహములు గడచి, యఖిల నరశరణ్యంబగు నైమిశారణ్యంబు సొచ్చి, యచటం గోటి గుణితాంగీకృతానత జనతా సమర్పిత నారాయణుండగు బదరీనారాయణుం బూజించి, మనీషి మనీషిత ఫలప్రదాన శుచి ప్రయాగంబగు ప్రయాగంబున కేఁగి, ముముక్షు జనహృదయంగమంబగు త్రివేణీ సంగమంబునఁ దానంబులుం దానంబులుం గావించి, యచ్చట మాధవు నారాధించి, భవ రసానుభవ భీరు సానుక్రోశం బగు పంచక్రోశంబుఁ బ్రవేశించి, యభ్యర్ణ మణి కర్ణిక యగు మణికర్ణికం గ్రుంకి, యన్నపూర్ణా విశాలాక్షీ సనాథుఁ గాశీవిశ్వనాథుం దర్శించి, త్రైర్థిక సమాహిత సమ్య గయకు గయకుం జని, యచట నుచిత కృత్యంబులు నిర్వర్తించి, శ్రీపురుషోత్తమ క్షేత్రంబునకుఁ జని, యింద్రద్యుమ్న సరస్సున శిరస్సు మజ్జనంబై, నమజ్జన దృక్చకోర జ్యోత్స్నానాథుని జగన్నాథుని గొలిచి, యాతల గౌతమీ తటినీతోయ స్నాతుండై, జగన్మోహన మనోజ మనో వశీకరణ కారణ కళా ప్రావీణ్య లావణ్య హావభావ ప్రకటన నటన రేఖా శ్లాఘా దూరీకృత రంభోర్వశీ రంభోర్వశీత కిరణ కిరణ నిభ విభారంగ న్మణిరంగ మంటపోజ్జ్వలాసికా కృతలక్షణ కటాక్షవీక్షణ సుధారసధారా సేచన కాసేచితాసేచన కాంగుండై, పాపాటవీ విపాటన పాటవ సంసూచన దీక్షారామ పరమేశ్వరుం డగు ద్రాక్షారామ భీమేశ్వరుం జేరి, జోహారులు నుపహారంబులు సమర్పించి, సంతతానంత కాంతిరంహుండగు నంతర్వేది నృసింహు సేవించి, యందు భవసాగర తరణియగు సాగర సంగమంబునఁ దీర్థంబాడి, కృష్ణవేణ్యాది పుణ్యతరంగిణుల మునింగి, యుత్తుంగ శృంగ విలోకి లోక సాత్కృత సుపర్వ పర్వతంబగు శ్రీపర్వతంబు లోచనపర్వంబుగాఁ జూచి, ప్రణమిల్లి, మల్లికార్జును సమ్మోదమునఁ బ్రణుతించి, తన్మనోఽబ్జ భ్రమరీ విభ్రమ రమ్యయగు భ్రమరాంబం బ్రశంసించి, భక్తశోభన పరంపరా సంపాదక పాదకమల రజోలేశు నహోబలేశు భజించి, నిజభజనరత జన ప్రతిపాదితానశ్వర పదంబులగు శ్రీ వేంకటేశ్వర పదంబులకు నమస్కృతులు విస్తరించి, దుస్తరాంహ స్తూలికా సందోహ దాహ దోహళ నిజాహ్వయ స్మరణ విస్ఫులింగం బగు శ్రీకాళహస్తి లింగంబు నంతరంగంబున హర్షతరంగంబు లుప్పొంగం గాంచి, కాంచీపురంబున కరిగి, కరిగిరీశ్వరుండై విరాజిలు వరద రాజుల నమ్రజన కమ్రఫల దాయకు నేకామ్రనాయకుం బూజించి, యవులఁగావేరి కావేరి కాంతరిత కాంతాంతరీపంబునఁ బ్రసన్న రూపంబునం బాటిల్లు కోటి హరిత్తు రంగధాముని రంగధాముని సేవించి, కుంభఘోణ చంపకారణ్యాది పుణ్యక్షేత్రమ్ము లీక్షించి, దక్షిణ నీరాకర వీచికా నికరశీకర తుందిల మందానిల స్పందనాతి శీతల సికతాతల పిహిత యాతాయాత నిరవధిక పథిక నికాయ కాయమానాయమాన లవల్యేలా వల్లీ వేల్లిత క్రముక ప్రముఖాఖిల శాఖి శాఖా శిఖా లతాంతర కుహర విహరమాణ వివిధ గరుద్రథ కుల కలకలోద్వేల వేలా మనోజ్ఞ మార్గంబున నపవర్గ రామేశ్వరంబగు రామేశ్వరంబునకుం బోయి, సేతు సందర్శనం బొనర్చి, విధూత స్నాతృ పంచజన వృజిన జనుష్కోటి యగు ధనుష్కోటిం గృతస్నానుండై, పాండు సూనుం డందులం దులాపురుషాది మహాదానంబు లాచరించి, రఘువీర భూభుజ భుజాదర్ప దర్పణం బగు రామాయణంబు పారాయణంబు చేసి, భూసురాశీర్వాద సంపదలం బొదలి, యచ్చోటుఁ గదలి, పదుమూఁడవ నెలఁ బాండ్య మహీ మండలాఖండలుం డగు మలయధ్వజుం డేలు మణిపురంబుఁ జేరం బోవు సమయంబున. 128

## అర్జునుఁడు పాండ్యరాజ సుత చిత్రాంగదను జూచి విరాళిగొనుట

సీ. మంగళస్నాన సంభ్రమముఁ దెల్పెడి రీతిఁ గెలనఁ గెందామర కొలనఁ దేలి,
ధవళముల్ విని చొక్కు హవణుఁ దెల్పెడు లీల హోళిఁగోయిల పల్కు లాలకించి,
తలఁబ్రాలు వోయు బిత్తరముఁ దెల్పెడు చాయఁ గ్రొన్ననల్ దోయిళ్ళ కొలఁది నొసఁగి
బువ్వాన భుజియించు పొలుపు దెల్పెడి జాడ గుమిఁ గూడికొని మరందములు గ్రోలి,
తే. తనకుఁ దోడ్తోడ నగు పెండ్లి కనఁబడంగఁ జేయునటువలె గారాబుఁ జెలులఁగూడి
వనవిహారంబు గావించి చనెడు పాండ్య రాజ సుతఁ జూచి యాపాండురాజ సుతుఁడు 129

తే. ఈ వెలంది యొడల్ పైఁడిలో వెలంది
యీ నెలంత లలాటంబు లే నెలంత;
యీ సుపాణి రదశ్రేణియే సుపాణి;
యీ బిడారు మృగీమద శ్రీబిడారు 130

క. వాతెఱకు నమృతమే తుల;
మే తులకింపుల పిసాళి మిసిమికిఁ గ్రొమ్మిం
చే తుల; చేతుల కబ్జము
లే తుల; లేతుల వెలందు లీ చెలి తులయే 131

క. కన్నె నగుమోము తోడన్
బున్నమ చందురుని సాటిఁ బోలుప వచ్చున్,
నెన్నుదురుతోడ మార్కొని
యున్నందఱుఁ జూడ రేక మోవక యున్నన్ 132

క. కమలముల నుజ్జగించున్,
గుముదంబుల బుజ్జగించుఁ గొమ చూపులు; పు
న్నమ చందమామ వెలుఁగుల
కొమ రంతయుఁ బుణికి పుచ్చుకొనఁ బోలుఁ జుమీ 133

శా. చెండ్లా గుబ్బలు! జాళువా తళుకులా చెక్కిళ్ల డాల్! సింగిణీ
విండ్లా కన్బొమ! లింద్రనీల మణులా వేణీరుచుల్! తమ్మి లేఁ
దూండ్లా బాహువు! లింత చక్కఁదన మెందుం గాన! మీ జవ్వనిం
బెండ్లాడంగలవాఁడు చేసినది సుమ్మీ భాగ్య మూహింపఁగన్ 134

మ. అని "కన్గొంటె విశారదా?" యనిన "నాహా! యే మనన్వచ్చు నో
జననాథాగ్రణి! యీ వినూతన తనూ సౌందర్య మీక్షించినన్
దనుఁ దా మెచ్చు విధాత చిత్తమున; నీ తన్వంగితోఁ బోల్పఁగా
నెన లే; దెచ్చటఁ జూడమా తుహిన భూభృ త్సేతు పర్యంతమున్ 135

క. మలయధ్వజ బాహుజను
స్తిలకుని గారాబుఁబట్టి చిత్రాంగద పే
రలఘు కుల శీల గుణములు
గల దీకన్య యని చెప్పఁగా వింటి నృపా!" 136

క. అన విని మనమునఁ గోర్కులు
కొనసాగఁగ "నీ నృపాలకునితో నెయ్యం
బొనరింప వలయు నేఁ డి
వ్వని నుండుద" మనుచుఁ జొచ్చి వచ్చుచు నుండన్ 137

సీ. పద్మ రేఖలఁ బొల్చు బాలికా తిలకంబు చరణంబు లూఁదిన తెరువుఁ జూచి
మలయధ్వజతనూజ కొలువు సేసిన జీవ దంతపుఁ జవికెఁ జిత్తరువుఁ జూచి
పొన్న గున్నల నీడఁ గన్నె పుప్పొడి తిన్నె మరుని బూజించిన హరువుఁ జూచి
కొమ్మ కౌఁగిటఁ జేర్చ గోరంట నంటిన మొనగుబ్బ కస్తూరి మురువుఁ జూచి,
తే. యీ వనము చేసినదికా యదృష్ట మనుచు రాజసుతుఁడు చిత్రాంగద మై జవాది
కమ్మతావి గుబాళించు తమ్మి కొలని కెలఁకులకుఁ జేరి, యంతంత వలపు మీఱి 138

మ. "తనకున్ గౌఁగిలి యీ వొకప్పుడును నాథా! నీ కరస్పర్శనం
బున గిల్గింతలె" యంచుఁ బద్మిని కరాం భోజమ్మునన్ మందమం
ద నటద్వాయు చలద్దళాంగుళులు కన్పట్టంగ న వ్వేల్పురా
యని రా! రా! యని పిల్చెనాఁ దగె ద్విరేఫాద్యంత దీర్ఘధ్వనుల్ 139

ఉ. నా విని హావ భావ పరిణామ విదుండు విశారదుం "డగున్
దేవరవార లిందు నరుదే శకునమ్ములు మంచి వయ్యె; వే
రావలె శోభ నోత్సవ పరంపర లిప్పుడు; చూడుఁ" డంచు నె
త్తావుల దీవులై తనరు తామర మొగ్గలు రెండొసంగినన్ 140

తే. అదియు నొక శకునంబుగా నధిపుఁ డంది
"చేతి కందిచ్చి నట్లనె చేకుఱంగఁ
గలదు వలిగుబ్బి గుబ్బేత చెలిమి" యనుచు
నాత్మలో నెంచి యా భావ మపనయించి 141

చ. "నెల యుదయించునప్పు డల నీరజముల్ కుముదంబు లౌను రేల్,
కలువలదాయ రాకకుఁ బగల్ కుముదంబులు నీరజంబు లౌఁ,
దలఁపఁగ నింత వింత గలదా!" యని కందువ మాట లాడుచున్,
"బళిర! కిరీటి" మీఱెఁ దన ప్రౌఢి విశారదుఁ డెన్నుచుండఁగన్ 142

ఉ. అంగజరాజు పాంథ నిచయంబులపై విజయం బొనర్ప నేఁ
గంగఁ దలంచునంత మును గల్గఁగ దాసులు వట్టు జాళువా

బంగరు టాలవట్టముల భంగిఁ గనంబడెఁ బూర్వ పశ్చిమో
త్తుంగ మహీధరాగ్రములఁ దోయజ శాత్రవ మిత్ర బింబముల్ 143

## సాయంకాల శోభ

క. ఒక మెట్టు తరణి డిగ్గిన
నొక మెట్టు శశాంకుఁ డెక్కు; నుర్వీ స్థలిలో
నొక రాజు సన్నగిల్లిన
నొక రాజంతంతకున్ మహోన్నతిఁ గనఁడే! 144

చ. క్షితిపయి వట్టి మ్రాఁకులు చిగిర్చ, వసంతుఁడు తా రసోపగుం
ఫిత పదవాసనల్ నెఱప, మెచ్చుక, చంద్రుఁడు మిన్నునం బ్రస
న్నతయును, సౌకుమార్యముఁ గనంబడ ఱాల్ గరఁగంగఁజేసె; నే
గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా! 145

చ. వెడ విలుకానికిన్ జెఱకు విల్లును, గల్వల కోరి, కోరికల్
గడలుకొనంగ నామనియుఁ, గల్వలరాయఁడు నిచ్చి మన్ననం
బడయుడు, వాని కెక్కుడుగ మౌర్వులు తామును గాన్క తెచ్చెనా
బడిబడి గంధలుబ్ధ మధుపంబులు రాఁజనుదెంచెఁ దెమ్మెరల్ 146

చ. ఒక చిగురాకుఁగొమ్మఁ బిక, మొక్క ప్రసూన లతాగ్రసీమఁ దేం,
ట్లొక ఫలశాఖ రాచిలుకయున్ రొద సేయఁగ, గాడ్పు పొందు వా
యక పయి వెన్నెలల్ పొలయ నామని సొంపుల నింప జొంప మా
నొక యెలమావిక్రింద మరుఁడో యనఁగా నరుఁడుండె నయ్యెడన్ 147

క. విధు చకచకలును, బుండ్రే
క్షు ధనుర్ధరు నంప సెకలు, శుక పిక శారీ
మధులిట్టులు మలయానిల
మధు లిట్టులు తనదు ధైర్యమహిమఁ గలంపన్ 148

చ. "చందన గంధి నెన్నుదురు చందురులో సగఁబాల; బాల ము
ద్దుం దెలి చూపు లంగజుని తూపుల లోపల మేల్తరంబు; లిం
దిందిరవేణి మోవి యెలదేనియలో నికరంపుఁ దేట యే
మందము! మందయాన మొగ మందము మీఱు నవారవిందమున్ 149

ఉ. బంగరు బొంగరాల పరిపాటి చనుంగవ; మీల సూటి త
ళ్కుఁ గనుదోయి; చంద్రు ప్రతికోటి మొగం; బెలదేఁటి ధాటిక
న్నంగడు మేటి వేణి; పులినంబుల సాటి పిఱుం; దయారె! చి
త్రాంగద పాటి జోటి గలదా?" యని మెచ్చుఁ గిరీటి మాటికిన్ 150

క. ఈ కరణి దలంచుచు నా
శీక నిభానన నెదన్ నిలిపి రే గడపెన్;
లే కెటుల నిద్ర వచ్చున్
రేకగు నయ్యువిద నెదను నిల్పిన దాఁకన్ 151

తే. అపుడు నృపుఁడు ప్రఫుల్ల నవాంబుజ ప్ర
సన్న ముఖుఁడయి "మలయధ్వజ క్షితీశ
కమలహితునకు మామకాగమన వార్తఁ
దెలుపు" మనుచు విశారదుఁ బిలిచి పనిచె 152

## విశారదుఁడు పెండ్లి రాయబారము నడపుట

చ. పనిచిన నేఁగి, యాతఁడు, నృపాలుని మంత్రి ముఖాంతరంబునం
గనుఁగొని "యంత్ర మత్స్యము జగం బెఱుఁగన్ భుజశక్తి నేసి జ
వ్వనిఁ గయికొన్న యర్జునుఁడు వచ్చిన వాఁడిదె తీర్థయాత్రగా,
జనవర!" యంచు విన్నపము సల్ప ససంభ్రమ చిత్తుఁడై తగన్ 153

క. తన నగరు వంటిదే చ
క్కని నగరొక టాయితంబు గావించి పురం
బు నలంకరింపఁగాఁ జే
సినవాఁడై యపుడు సకల సేనలు గొల్వన్ 154

చ. ఎదురుగ వచ్చి పాండ్య ధరణీశ్వరుఁ డర్జునుఁ గాంచి "నేఁడుగా
సుదినము! మీరు రాఁ గలుగు శోభన మెన్నఁడు గల్గుఁ; బ్రోలికిం
బదుఁ" డని యిద్దఱున్ దొఱసి భద్రగజంబుల నెక్కి వచ్చి రిం
పొదవ హళాహళిం గడకు నొత్తెడు ఫౌఁజుల దిక్కు సూచుచున్ 155

తే. రాజ వీథుల నెసఁగ నీరాజనములు,
కటికవా రెచ్చరింప నైకటిక భూమి,
వంది జనములు పొగడఁ జెల్వంది మిగులఁ
బురము సొత్తెంచె విజయుఁ డబ్బురము గాఁగ 156

క. నెట్టుకొని నరుని గనుచోఁ
బట్టణమునఁ గల సమస్త భామల కహహా!
యెట్టి విచిత్రమొ! మనసునఁ
బుట్టినవాఁ డపుడు మనసుఁ బుట్టించెఁ జుమీ! 157

ఉ. "చక్కఁదనంబు రూపునఁ బొసంగుటె కాదు; గుణంబులందునున్
జక్కఁదనంబు గల్గు నెఱజాణ; జగంబుల నీడు లేని నా

చక్కని కూఁతునుం దొఱయఁ జాలినవాఁ; డితఁడల్లుఁడైనఁగా
మిక్కిలి కీర్తి గల్గు?" నని మెచ్చు మనంబున రాజు సొరెకున్ 158

చ. అడు గడుగందునున్ మణిపురాధిపుఁ డిట్లుచితోపచారముల్
కడు నొనరించి యుద్వహన కౌతుక హేతు కళావిశేషమౌ
విడిదికిఁ దెచ్చి, నిల్పి, యతివిస్మయ మందఁగ విందు, వీడుకో,
లుడుగరలున్ ధనంజయుని యుల్లము రంజిలఁ జేసె నెంతయున్ 159

## ఆశ్వాసాంతము

మ. సరసాగ్రేసర! వాసరప్రభు తనూజ స్థూలలక్షా! పురం
దర జిద్భోగ ధురంధరా! భరతశాస్త్ర ప్రౌఢ మార్గైక లా
స్య రసాస్వాదన కోవిదా! శ్రవణ భూషా దివ్యరత్న త్విషా
తరణి శ్రీకర గల్లభా! విభవ భృత్తంజాపురీవల్లభా! 160

క. యాచనక వినుత! వనితా
సేచనక మనోహరాంగ! శృంగార కళా
సూచన క్రమ కవిత్వా
లోచన కందళిత హర్ష లోలుప హృదయా! 161

క. తరుణీ మన్మథ! యాశ్రిత
భరణ గుణాభరణ! శౌర్య బహు రాజ్య ధురం
ధర! సత్యాదిమ చక్రే
శ్వర! యభినవ భోజరాజ వర బిరుదాంకా! 162

తోటక. అతులాగమ శాస్త్ర నిరస్త సురే
జ్య! తులాధిక విద్వ దవాప్త శత
క్రతులాభ! శుభోదయ కారణ ర
త్న తులాపురుషాదిక దానచణా! 163

గద్యము. ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ ప్రసిద్ధ సారస్వత సుధాసార జనిత
యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్యతనయ వినయ ధురీణ సకల
కళాప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ భూపాలదత్త హస్తముక్తాకటక విరాజమాన వేంకట కవిరాజ
ప్రణీతంబయిన విజయవిలాసంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము 164

---

# ద్వితీయాశ్వాసము





ధుర్య శౌర్య! ధైర్య
క్ష్మాధర మూర్ధన్య! యాది గర్భేశ్వర! వి
ద్యాధిక! వితరణ దీక్షా
రాధాసుత! యచ్యుతేంద్ర రఘునాథ నృపా! 1

తే. అవధరింపు కథాకర్ణనాతివేల
హర్షు లై నట్టి దివ్య మహర్షులకును
తత సమస్త పురాణ కథా శతాంగ
సూతుఁడై విలసిల్లెడు సూతుఁ డనియె 2

విశారదుఁడు మలయధ్వజుని యాశయము నర్జునునకు విన్నవించుట

ఉ. ఆ చెలువంపు రాకొమరుఁ డంత వయస్యుని జూచి యింపుతో
"నీ చతురత్వ, మీ వినయ, మీ యుచితజ్ఞత యెందునేనియుం
జూచితె? మైత్రికిం దగిన చోటగు; శోభనపుం బ్రసంగమున్
సూచన చేసి రాజు మది చొ ప్పెఱుఁగన్ వలదా విశారదా?" 3

మ. అనినన్ "మీ మదిలోఁ దలంచినది మేలౌ; సిద్ధసంకల్పు లీ"
రని యావేళనె చిత్రవాహనుఁడు కొల్వై యుండఁగాఁ బోయి యా
యన "రా రమ్మ"ని గారవించి సుముఖుండై "రాజుగా రిప్పు డే
మనినా? రెయ్యది వార్త?" యంచుఁ బయిపై నాసక్తితోఁ బల్కఁగన్ 4

చ. "అవనితలేంద్ర! మా విభుని హర్ష మదేమని విన్నవింతు? సం
స్తవ మొనరించి రింతవడి సామిచరిత్రమె వేయినోళ్ళ; న
ర్ణవపతితోడ బాంధవ మొనర్చిన మాధవు లీలఁ దారు బాం
ధవ మొనరింపఁ జిత్త మిడినారు గుణాంబుధు లీరు గావునన్" 5

క. నా విని సంతోషము మది
నావిర్భవ మొంద "నా మహారాజునకున్
దేవేరిగ నా కన్నెన్
బావన గుణ నీయఁ గనుట భాగ్యము గాదే? 6

చ. కల దొకమాటఁ దెల్పఁగల కార్యము; తొల్లి ప్రభాకరుండు నాఁ
గలఁ డొకఁ డస్మదీయ కులకర్త; యతం డనపత్యుఁడై యచం
చలమతి శంకరుం గుఱిచి చాలఁ దపం బొనరింప నంతటన్
'గలుగుఁ గుమారుఁ డొక్కొకఁడుగా' నని యిచ్చె వరంబు వేడుకన్ 7

క. అంగజ హరుని ప్రసాదము
నం గలుగుచు వచ్చె సుతుఁడు నాఁ డాదిగ మా
వంగడమున; నది యిప్పుడు
వెంగడమై కూఁతు రుద్భవించె న్నాకున్ 8

క. ఆ దుహితఁ గుమారుని మ
ర్యాదగఁ జూచికొని యుందు; నా కన్నియకున్
బ్రాదుర్భవించు వానిన్
నాదు కులంబునకు వలయు నాథుని జేయన్ 9

క. కా దనరా దీకార్యము;
జాదులును బ్రసాదమౌ విశారద! నాకున్
నాదు హితం బొనఁగూరిచి
నా దుహితం బెండ్లి సేయు నరనాథునకున్" 10

తే. అని యతనిఁ బంచె; నా మాట కర్జునుండు
సమ్మతించె; ముహూర్త నిశ్చయము నయ్యె;
హితుఁ డన విశారదుఁడె కాక యెందుఁ గలరె?
కోర్కి వెలయంగ దొరఁ బెండ్లికొడుకుఁ జేసె 11

## చిత్రాంగదా వివాహ మహోత్సవము

క. సుత్రామ నిభుఁడు పాండ్య ధ
రిత్రీ విభుఁ డానతీయ, శృంగార కళా
చిత్రాంగద యుత యగు నా
చిత్రాంగదఁ బెండ్లికూఁతుఁ జేసిరి కాంతల్ 12

క. గరిత లలంకృతి సేయఁగ
గరువపు మురు వపుడు హెచ్చి కన్నియ దనరెన్;
బరిణయపుం గై సేఁతల
నరపతి యొఱ పతిశయిల్లు నటనఁ జెలంగెన్ 13

మ. తన వంశంబు నృపాలు పెండ్లిc గను తాత్పర్యంబునన్ వచ్చెనో
యనc జంద్రుం డలరెన్; గిరీటి సుముఖుండై యంతc గైసేసి తె
చ్చిన భద్రేభము నెక్కి, ఠీవిమెయి వచ్చెన్ బాండ్యభూపాలు లో
చనముల్ చల్లcగc, గ్రొత్త ముత్తియపు సేసల్ జవ్వనుల్ చల్లcగన్ 14

చ. నలుగడ హృద్య వాద్య నటనం బొలయన్, గపురంపు టారతుల్
వెలయ, ద్విజశ్రుతుల్ చెలcగ, విప్ర వధూ శుభ గాన లీల శో
భిలcగ వివాహవేదికకుc బెండ్లికుమారుcడు వచ్చె నిట్టు; లా
వల నల పెండ్లి కూcతురును వచ్చె రణచ్చరణాంగదంబులన్ 15

శా. పంకేజాతములన్ దిసంతు లడచున్ బాలామణీ పాదముల్;
వంకల్ దీర్చు మనోజ సాయకములన్ వాల్చూపు; లేణాంకునిన్
శంకల్ సేయు మొగంబు; జక్కవకవన్ జక్కట్లు దిద్దుం గుచా
హంకారంబు; మదాళిమాలికల నూటాడించు వేణీ రుచుల్ 16

క. హరిపతి నడుమున కూడెన్;
గరువపు నడకలకు నోడె గజపతి; యిcక నీ
నరపతి లోనగు టరుదే
వరవర్ణిని మెఱుcగు వాcడి వాల్చూపులకున్? 17

ఉ. "చక్కని కన్యకామణికిc జక్కనివాc డగు ప్రాణనాథుcడున్,
జక్కని శోభనాంగునకుc జక్కని యింతియుc గల్గు టబ్బురం
బెక్కడ, నిట్టు లుండవలదే! రతిదేవికి సాటి వచ్చుc బో
యి క్కనకాంగి; మన్మథున కీ డితc డీడిత రూపసంపదన్" 18

క. అని రూప కళలc జూపఱు
గొనియాడcగc, బేరcటాండ్రు గొందఱు తెర వం
చినc జూచె నతివ నర్జునుc
డనురాగాంబుధి తటాన నటc దెర యెత్తన్ 19

తే. కలదు లే దన నసియాడు కౌను తీరుc,
దళుకు మొగమున కెగయు గుబ్బల బెడంగుc
జూచి, యాతని నిడువాలుc జూపు లపుడు
నిండు వేడుక మిన్నంది కొండc దాcకె 20

చ. చిలకలకొల్కి కన్గొనియెc జేరలc గొల్వcగ రాని కన్నులున్,
మొలక మెఱుంగు నీలముల ముద్దులు గాఱు నొయారి మీసముల్,
గలకల నవ్వు చక్కని మొగంబు, వెడంద యురంబు, సింగమున్
గలచు రువాణపుం గవును గల్గిన యా కురువీర పుంగవున్ 21

క. అంగజ రాజ్యం బెలుట
కుం గట్టిన తోరణం బొకో యన, నతఁ డా
శృంగారవతికిఁ గట్టెన్
మంగళసూత్రంబు చతురిమం గళసీమన్ 22

మ. అనురక్తిం దలఁబ్రాలు వోసె విజయుం డావేళ బంగారు కుం
డన రంగౌ నలినీలవేణిపయి ముత్యాల్ దోయిటన్ ముంచి చ
య్యనఁ బాల్పొంగిన కైవడిన్ సిరులు పెంపైఁ బూలు రేకెత్తిన
ట్లనె వర్ధిల్లు మటన్న దీవనల కెల్లన్ దావలం బై తగన్. 23

తే. తామ్రపర్ణీ నదీతీర ధరణి నేలు
దొరతనముఁ దెల్పఁగా రాశి దొరలఁ బోసె,
ముదిత చేతులఁ దలఁబ్రాలు ముత్తియములు
ముదిత చేతులగుచు సభాసదులు వొగడ 24

క. ఈ చందంబునఁ గల్యా
ణోచిత కృత్యంబు లెల్ల నొనరిచి యంతన్
రాచూలి భోగ్యవస్తు
ప్రాచుర్య మనోజ కేళిభవనమునందున్ 25

## చిత్రాంగదార్జునుల పడుకటింటి ముచ్చటలు

చ. మినుకుఁ గడాని జీనిపని మేలిమి మంచముపై వసించి యుం
డినయెడ నొయ్యనన్ సఖులు నేర్పునఁ దోడ్కొని వచ్చి ప్రోల జ
వ్వని నిడి తోడి చూపులకు వచ్చినవారును బోలె వెన్కకుం
జని; రవుఁ గాదె పై నతను సంగర మా నవమోహనాంగికిన్ 26

ఉ. చంచలనేత్రఁ గాంచి నృపచంద్రుఁడు మోహము నిల్పలేక చే
లాంచల మంటి, శయ్య కపు డల్లనఁ దార్చి, కవుంగిలింప నుం
కించుఁ; బయుంట నంట గమకించుఁ; జెలించు టదెప్పు డెప్పు డం
చించుక సేపులోన మెఱయించు ననేక మనోవికారముల్ 27

ఉ. "కానుక గాఁగ నిత్తు బిగి కౌఁగిలి, పల్కవె కీరవాణి! నీ
ఠౌ నుడి తేనె నా చెవుల నానఁ, గృపారస ధార నాన న
న్నానన మెత్తి చూడు నలినానన! గోలతనాన నేల లో
నానఁ జలంబు నీకు? మరు నాన సుమీ! విడు నాన యింతటన్ 28

ఉ. చక్కెరవింటి దేవర ప్రసాదముఁ గైకొను మిప్పు; డంద మో
చక్కెరబొమ్మ!" యంచు విలస న్మణికంకణ హస్త మంటి పే
రక్కఱఁ గప్పురంపు విడె మా నెఱజాణ యొసంగి నిక్క లేఁ
జెక్కిలి ముద్దు వెట్టుకొనెఁ; జెప్పెడి దే మిఁక నా వినోదముల్! 29

ఉ. ఇగ్గెడు వెనక్కుం బయికి నీడ్చినఁ; బైఁటఁ దొలంగఁ జేయఁ గే
లొగ్గెడు; రెమ్మి పోఁకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండు కొంగులున్
బిగ్గ నడంచుచున్ విడిచిపెట్టదు; బాల ననం బనేమి? యా
సిగ్గుకు సిగ్గు లే దిటులు సేసిన పిమ్మట నుండవచ్చునే? 30

తే. "కోర్కి వెలయంగ నిను దెచ్చి కూర్చినట్టి
తియ్య విలుకాని ఋణ మెందుఁ దీర్చుకొందు
నువిద! నీ చేయి చూచుక యున్న నాకు
నింద మని వేగ నీవి నీ వియ్యకున్న? 31

సీ. మకరకేతనుఁ గూర్చి మకరికా లతలు నీ చెక్కుల వ్రాయంగ మ్రొక్కుకొంటిఁ;
గుసుమాకరుని గూర్చి కుసుమ మాలికలు నీ వేనలిఁ దుఱుమంగ వేఁడుకొంటి;
గంధవాహనుఁ గూర్చి గంధసారంబు నీ గుబ్బలఁ బూయంగఁ గోరుకొంటి;
మృగలాంఛనుని గూర్చి మృగమదంబున నీకుఁ దిలకంబు దిద్దఁ బ్రార్థించుకొంటి; 32

తే. నిన్ను వరియించునప్పుడే యిన్ని చేయు వాఁడ నని మున్ను శృంగార వనములోన;
వల పెఱిఁగి యేలుకోగదే కలికి!" యనుచుఁ గేళి కెలయించె నమ్ముద్దరాలి నపుడు 32

క. పొక్కిలి పొంతఁ గరం బిడి,
చెక్కిలి చెంత నొక కొంత చిఱున వ్వొలయన్
జక్కిలిగింతలు గొలిపెన్
మిక్కిలి వింతలుగ రతికి మేకొన నంతన్ 33

ఉ. డాసిన నింగితం బెఱిఁగి డాయఁగ నేరక, తత్తరంబునన్
జేసిన సేఁతకున్ బదులు సేయ నెఱుంగక, మేను మేనితో
రాసినయంతనే కళలు రంజిలి కౌఁగిట బాల యుండెఁ బో;
యా సుఖ మింత యంత యన నైనది గాదు గదయ్య క్రీడికిన్ 34

ఉ. అంగజరాజ్య వైభవ సుఖాంబుధి నీ గతి నోలలాడి, చి
త్రాంగద సేవఁ జేయ మలయధ్వజు నిల్లట పల్లుఁ డై, తదీ
యాంగబలంబు గొల్వ నరుఁ డందుల రాజ్యము సేయుచుండ నా
సింగపుఁ జిన్ని లే నడుము చెల్వకు గర్భము నిల్చె; నంతటన్ 35

శా. మించెన్ బోరచి కోరికల్; కడు విజృంభించెన్ దనుగ్లాని; కా
న్పించెన్ మేచక కాంతి చూచుకములన్; జెక్కిళ్లపైఁ దెల్పు రె

ట్టించెన్; గూర్కులు సందడించె; నడ చండించెన్; మృదామోదము
న్గాంచెన్ వాతెఱ; యోసరించెఁ ద్రివళుల్ నానాఁటికిన్ బోటికిన్ 36

## బభ్రువాహన జననము

క. సీమంతవతీ మణికి
న్సీమంతముఁ జేసి రపుడు నెల లెనిమిది గా
శ్రీ మంతు కెక్కు గర్భ
శ్రీమంతుం డీతఁ డనుట సిద్ధము గాఁగన్ 37

క. ప్రొద్దుల నెలలన్ వేవుర
నుద్దులుగాఁ జేయఁ దగు మహో యశములు గా
ముద్దుల బాలుని గనియెను
బ్రొద్దుల నెల యెడల నిందుముఖి శుభ వేళన్ 38

చ. ధనము లసంఖ్యముల్ హిత బుధ ద్విజకోటికి నిచ్చి, యప్పు డా
తనయుని బభ్రువర్ణ హయధట్టము నేలెడు నంచు బభ్రువా
హనుఁ డను పేరు వెట్టి చెలువందఁగ బంగరుఁదొట్లఁ బెట్టి, శో
భన విభవాప్తి రంజిలిరి పాండవ పాండ్య వసుంధరాధిపుల్ 39

సీ. "తన కులస్వామి తండ్రిని సుధాంబుధిఁ బోలుఁ బాల బుగ్గల మించు లీలఁ గనుటఁ,
దన పితామహుని బృందారకాధిపుఁ బోలు రెప్ప వేయక చూచు రీతిఁ గనుటఁ,
దన వంశకర్త నుత్పల బాంధవుని బోలుఁ గరము లర్మిలిఁ జాఁచి గారవిలుటఁ,
దన తాత యనుఁగుఁ దమ్ముని నుపేంద్రుని బోలు నల్ల నల్లనఁ దప్పుటడుగు లిడుట

తే. దాన గాంభీర్య, వైభవ, దాన, కృపలు గల వని కనంబడఁగ వేఱ తెలుప నేల?"
యని గురుజనంబు లెంతయు నాదరింపఁ జిన్ని బాలుండు ముద్దులు చిలుకుచుండె 40

తే. ఆడితప్పని ధర్మజు ననుఁగుఁ దమ్ముఁ
డా కుమారకుఁ జిత్రవాహనున కపుడు
వంశకరుఁగా నొసఁగి వేడ్క వారిచేత
నంపకముఁ గాంచెఁ దీర్థ యాత్రాభిరతిని 41

## సౌభద్ర తీర్థమందలి మకరముల శాప మోక్షణము

మ. చని యా దక్షిణ పుణ్యభూమిఁ గనుచున సౌభద్ర తిర్థంబునం
దును స్నానం బొనరింపఁ బోవ నట మౌనుల్ కొంద “ఱోహో! నిలుం
డనఘైతన్ముఖ పంచతీర్థములయం దత్యుగ్ర నక్రంబు లుం
డును నూటేఁడులనుండి; యిందు నొకనాఁడున్ జేరరా దేరికిన్ 42

ఆ. ‘మోక్షమునకుఁ బోవ మొస లెత్తుకొనిపోయె’
ననెడు వార్త నిక్క మగు నటంచుఁ
గ్రుంక వెఱతు రెవ్వరును; మీర లటు పోకుఁ”
డనిన నవ్వుకొనుచు నర్జునుండు 43

తే. “ఏను తీర్థము లాడఁగ నేఁగుదెంచి
యేను తీర్థ లాడక యివలఁ జనుట
పౌరుషమె?” యంచుఁ గ్రుంకఁబో వారిచరము
పట్టెఁ, బట్టిన న మ్మహా బాహుబలుఁడు 44

క. ఎడమ కరంబుననే యా
యెడ మకరముఁ బట్టి బయటి కీడిచి వైవన్
వడి భూమికఁ జూపిన కై
వడిఁ దొల్లిటి రూపు వాసి వాసి యెసంగన్ 45

ఉ. వట్రువ గుబ్బలున్, దొగరు వాతెఱయున్, జిఱునవ్వు వెన్నెల
లొట్రిలు ముద్దుమోమును, దళుక్కను మేను, వెడంద సోగ యై
వట్రిలు కన్నుదోయి, నిడువాలుఁ గురుల్, బటువౌ పిఱుందు, లేఁ
గుట్రు నునుంగవున్ గలుగు కోమలియై యది మ్రోల నిల్చినన్ 46

క. ఆ లోలనయనఁ గనుఁగొని
యాలోచన చేసె నృపతి యద్భుత మతియై
యాలో ‘నిది యచ్చర ప్రో
యాలో, కా కల్ల మరుని యాలో’ యనుచున్ 47

క. ‘ఈ బాల మోమునకు నా
జాబిల్లికి నెంత దవ్వు? సరి వచ్చునొకో
యీబిడ చనుగవ కొక మె
ట్టా బంగరు గట్టు; తక్కు వౌ నెంచంగన్ 48

క. నడు మెంత సైక? మోహో,
పిడికిటిలో నణఁగు; బెళుకు బేడిస మీలన్
గడ కొత్తుఁ గన్ను; లౌరా!
జడ యందముఁ జోపఁ బాఁపజగతిన్ గలదే?’ 49

మ. అని యా క్రీడి మనంబునన్ బొగడి యుగ్రాకార నక్రంబ వై
మును పట్టుండిన దేమి? మేలు చెలువంపుం గల్కివై యిప్పుడొ
ప్పిన దే? మెవ్వరి భామినీమణివి? నీపేరేమి?" నా నిట్లనున్
"విను మో భూవర! యానుపూర్విగఁ బురావృత్తాంత మాద్యంతమున్ 50

## నంద మొదలగు నచ్చరకాంతల చరిత్ర

క. ఏ నంద యనెడు నచ్చర
చానన్; దరుణేందుధరుని సఖుని యనుంగన్;
నా నెచ్చెలులు త్రిలోకీ
యానేచ్ఛలు గలరు నల్వు రతుల శుభాంగుల్ 51

ఆ. వారు లలిత, పద్మ, సౌరభేయి, సమీచి
యనెడు పేర్లు గలుగు నట్టివారు;
జగము లెల్లఁ జూచి చను దెంచుచో మేము
వనధి కాంచి నొక్క వనము కాంచి 52

మ. 'విహరించున్ మలయానిలం బిచటఁ; దావిం జిల్కి నెమ్మేని యా
విహరించున్; బిక నాదముల్ చెవికిఁ గావించుం జవుల్; పోద మా
సహకారాళి పదంబుఁ జూడఁగ వయస్యా! హాళి వాటిల్లెడున్
సహకారాళి పదంబుఁ జూడఁగ వయస్యా! హాళి యౌనే కదా!' 53

క. అని యితరేతర చతురో
క్తిని గుంఫన మెఱయ నరిగి తేఁకువ నందున్
ముని యొకఁడు తపము సేయం
గని, యది విఘ్నంబు సేయఁ గడఁగి, కడంకన్ 54

క. నెఱి కురులు, కేలుఁజిగురులు,
నిఱి చన్నులు, విరివి కన్ను, లించుక కౌనుల్,
చిఱుఁదొడలు, నంచ నడలు
న్మెఱపుల యొఱపులు ఘటింప నిలిచి నటింపన్ 55

క. మా పొలు పొకింత గనుఁగొని
తాపసుఁడట వలపు పేరు దైవ మెఱుంగున్,
శాప మొసఁగె మకరులుగాఁ
గోప రసావేశ రూక్ష కుటిలేక్షణుఁడై 56

క. అందులకుఁ జాల భయపడి,
యందఱ మడుగులకు వ్రాలి, యతి దీనతతోఁ
గొందలపడ, నపు డాతని
డెందము గై కొనియె నక్కటికపుం బెంపున్ 57

ఉ. శీతల దృష్టిఁ జూచి మునిసింహుఁడు 'నా వచనం బమోఘ మో
భీతమృగాక్షులార! మది బెగ్గిల నేల యిఁకన్? వినుండు మీ
చేత గృహీతుఁడై సలిలసీమను నెవ్వఁడు వెల్వరించు మి,
మ్మాతఁడె శాపమోక్షకరుఁ డయ్యెడుఁ; బొం' డని పంచెఁ, బంచినన్ 58

చ. 'ఇలఁ గల వీళ్లు చూడ మన మేటికిఁ బోవలెఁ?బోయినన్ వనిన్
నిలువఁ బనేమి? నిల్చిన మునింగని త్రుళ్ళఁగ నేల? యంతలో
నలిగి శపింప నేమిటికి నాతఁడు? వ్రాఁతఫలంబు దప్పునే?
కలిగినవే కదా మకరికల్ మన కెప్పుడు వ్రాసి యుండుటల్!' 59

తే. అనుచు ననుతాపమునఁ ద్రోవఁ జనుచు నుండ
నారదుఁడు చూచి 'యచ్చరలార! మీరు
చిన్నవోయిన మొగముల నున్నవార
లే?' మనినఁ బూర్వవృత్తాంత మెల్లఁ దెలిపి 60

తే. 'ఋషితిలక! కంటివే మా యదృష్టరేఖ?
కుడిచి కూర్చుండి యిదె యొక బెడఁదఁ దెచ్చు
కొంటి; మే మేడ? మకరులై యుంట యేడ?
యర్హమే యిట్టి బాధ బింబాధరలకు?' 61

క. అన విని యనిమిష ముని 'యో
వనితా తిలకంబులార! వసుధా గీర్వా
ణుని శాపము విధికృత; మే
ఘనునకుఁ దప్పింప నలవి గా; దటు లగుటన్ 62

ఉ. మీరలు దక్షిణాంబుధి సమీపమునం దగు పంచతీర్థముల్
చేరియు, గ్రాహ రూపములఁ జెంది, శతాబ్దము లున్నఁ దీర్థ సే
వారతి భారతాన్వయుఁడు, వాసవనందనుఁ, డర్జునాఖ్యుఁ డే
తేరఁగలం; డతండు కడతేర్చు మిమున్ దృఢ సాహసంబునన్ 63

క. చనుఁ డచటికి నిపు డిం పెన
య; న దుఃఖం పంచభి స్సహ యనంగా మున్
విని యుందురె కద! యేటికి
మనమున నుమ్మలికఁ జెంద మదవతులారా?' 64

శా. అంచునమమ్ముల నూఱడించ విన యాహ్లాదంబు లెంతె విజృం
భించన్ మ్రొక్కి జగంబులందును మిముం బేర్కొన్న మాత్రం బటా
పంచం బై దురితంబు లెల్లఁ జనఁగా భక్తిన్ మిమున్ నేఁడు ద
ర్శించన్ ఖేదము వోయి మోదము మదిం జె న్నారదా నారదా! 65

క. మీ కతమున నూఱేం డ్లని
మాకున్ మితి యెఱుక వడియె; మంటి' మటంచున్
లోకేశ్వర సుతు దీవనఁ
జేకొని, యిట వచ్చి, నిలిచి చిత్తములోనన్ 66

క. 'దుర్జనన విసర్జనముగ
నిర్జరలోకాధినాథుని సుతుం డగు నా
యర్జును సర్జన సముదా
యర్జునుఁ గనుఁగొనెడి భాగ్య మది యెన్నఁటికో?' 67

చ. అని తలపోయుచున్ మకరికాకృతు లూని యి టుండఁగా, నిదే
పనిగ మదీయ పుణ్య పరిపాక మనం జనుదెంచి నీవు న
న్మనిచితివే కదా! కడమ నా చెలు లౌ జలచారి చారులో
చనలకు శాపమోచనము సల్పి కృతార్థలఁ జేయు పార్థివా!" 68

క. అని నంద వేఁడినం, ద
క్కిన తీర్థము లాడి, వారికిన్ శాప విమో
చన మొనరింపఁగ, నేవురుఁ
జనుదెంచి శుభాంగ లీల సన్నిధి నిలువన్ 69

క. 'కలలో నెఱుంగ మే గణి
కలలో నీ చెలువమున్; సకల లోకములన్
గల లోలాక్షుల గరగరి
కల లోఁగొనినారొ? చంద్రకళలో వీరల్?' 70

క. అని 'తనచే నిజరూపముఁ
గనిరి గదా!' యనుచు వేడుకం దగు నృపతిం
గని యా యచ్చర లి ట్లని
కొనియాడఁ దొడంగి రధిక కుతుకాన్వితలై 71

## వేలుపు మించుఁబోణు లర్జునుని బలవైభవాదుల నభినందించుట

సీ. బల వైభవంబుచె గెలుచు మాత్రమె కాదు గమన లిలను గెల్చు గంధకరిని
గీర్తి విస్ఫూర్తిచే గెలుచు మాత్రమె కాదు నగు మొగమ్మున గెల్చుఁ దొగలజేని
బలు సాహసంబుచే గెలుచు మాత్రమె కాదు మినుకుఁ గౌనున గెల్చు మృగకులేంద్రు
నలఘు దానంబుచే గెలుచు మాత్రమె కాదు నెఱుల కాంతిని గెల్చు నీరదమును

తే. సకల సద్గుణ సౌందర్య సార మూర్తి యనియు మును నారదుఁడు దెల్ప వినియ యుంటి
మి మ్మహో భుజు, నిప్పుడో కొమ్మలార! కంటిమి గదమ్మ కన్నుల కఱవు దీర! 72

తే. బాపు! వలరాజు గర్వంబుఁ బాపు రూపు;
చాఁగు! రేరాజు కళల మిం చాఁగు రేఖ;
మేలు! నలరాజు సోయగ మేలుఁ జెలువ;
మమ్మ! యీ రాజు ప్రతి గాన మమ్మ యెచట! 73

తే. అందఱును నింద్రనీల నిభాంగుఁ డందు
రింద్రనీల నిభాంగుఁడే యితఁడు గానఁ;
దండ్రిఁ బోలిన రూపు మాత్రంబె కా ద
యారె! భూలోక దేవేంద్రుఁ" డంచుఁ బొగడి 74

తే. "నీకుఁ గల్యాణ మౌ రమణీయ రూప!
నీకు వంశాభివృద్ధి యౌ నృపకలాప!
నీకు జయ మగు సాహస నీతి భరిత!
నీకు సామ్రాజ్య మౌ మహనీయ చరిత!" 75

శా. అంచున్ వేలుపు మించుఁబోణులు శుభోదర్కంబు గాన్పించ దీ
వించన్ వారిఁ బ్రియానులాపములచే వీడ్కొల్పి, గోకర్ణ భూ
ప్రాంచ ద్దూర్జటిఁ గొల్చి పశ్చిమ సముద్ర ప్రాంత పుణ్యస్థలుల్
కంచున్ బోయి ప్రభాస తీర్థమున వేడ్కం గ్రీడి క్రీడించుచున్ 76

తే. ద్వారకాపుర మచటికిఁ జేరు వనుచుఁ
జెప్పఁగా విని కడు సంతసిల్లి 'కలదు
గా! యిఁక సుభద్ర రూప రేఖా విలాస
విభ్రమంబులు గనఁ జూడ్కివిందు కాఁగ 77

క. అర చందమామ నేలిన
దొరగా నెన్నుదురు నె న్నుదురు బిత్తరికిన్;
బరువంపు మొల్ల మొగ్గల
దొరగాఁ బల్కుదురుఁ బ ల్కుదురు జవ్వనికిన్ 78

క. అలకలు నీలము, లధరం
బల పగడము, గోళ్లు ముత్తియంబు లటంచున్

దెలుప మును విందుఁ జిలుకల
కొలికి తెఱం గెల్లఁ బూసఁ గ్రుచ్చిన రీతిన్' 79

తే. అనుచు నా కన్యఁ గైకొను నాసఁ దగిలి,
యతులకు విధేయు లగుదురు యాదవు లని,
తను నెఱుఁగ కుండవలె నన్యు లనియుఁ దలఁచి
యనుచర జనంబు నందంద పనిచి యంద 80

## అర్జునుని కపటసన్న్యాస స్వీకారము

సీ. మృగనాభి తిలకంబు బుగబుగల్ గల లలాటముపై మృదూర్ధ్వ పుండ్రంబు దీర్చి,
తపనీయ కౌశేయ ధౌరేయ మగు కటీరమునఁ గాషాయ వస్త్రము ధరించి,
శరణాగతాభయ సంధాయకం బైన దక్షిణపాణిఁ ద్రిదండ మూని,
రణ చండ కోదండ గుణ కిణాంకం బైన డాకేల నునుఁ గమండలువు దాల్చి

తే. 'యుండెఁ బో శాంతరస మెల్ల నుట్టి పడఁగ నంగనల పొందు రోసి సన్న్యాసి యగుట
గద యుచిత మెందు' నా నవ మదన మూర్తి యంగనామణిఁ గోరి సన్న్యాసి యయ్యె 81

క. ఇటు లుండి "తనదు కోరిక
ఘటియింప హలాయుధుండు గాఁ డనుకూలుం;
డటు లైన నేమి? యఘటన
ఘటనా చతురుండు గలఁడ కా హరి" యనుచున్ 82

క. గోపాల నందనుం డా
గోపాలక చక్రవర్తి కోమల దివ్య
శ్రీపాద పద్మములు దన
లోపలఁ దలపోయ నంత లోపల వేగన్ 83

ఉ. సొన్నపు సన్నచేలఁ గటిఁ జుట్టి, కిరీటము మౌళిఁ దాల్చి, రే
మన్నియతోడఁ బుట్టు పెను మానిక మక్కునఁ జేర్చి, వచ్చి చెం
త న్నిలిచెన్, దయారస మెదం బొదువన్ యదువంశ దుగ్ధవా
రాన్నిధి పూర్ణిమా విశదరశ్మి దరస్మిత చారు వక్త్రుఁడై 84

ఉ. అప్పుడు సామి తాఁ దలఁచి నంతనె వచ్చె నటంచు విస్మయం
బుప్పతిలంగ వేడ్క నన లొత్తఁగఁ గన్నుల హర్ష బాష్పముల్
చిప్పిలఁ జక్రి పాదసరసీజములం బ్రణమిల్లి, తద్రుచు
లెప్పల నప్పళించుచును లేవక యుండఁగ సంభ్రమంబునన్ 85

## కృష్ణుఁ డర్జునుని రైవత పర్వతమున నిలుపుట

ఉ. గ్రుచ్చి కవుంగిలించుకొని, కూరిమితోఁ గుశలంబు వేఁడి, తా
వచ్చిన రాక లోఁ దెలిసి, "ద్వారక రైవతకాద్రి పొంతనే,
యిచ్చటికిన్ సమీప" మని కృష్ణుఁడు తెల్పుచుఁ, దోడితేరఁగా
వచ్చె రథంబుపై నపుడు వాసవి వేసవి యేఁగునంతటన్ 86

తే. వచ్చి రైవతకారామ వాటి నిల్చి
కృష్ణుఁ డం దిష్ట గోష్ఠి నా రేయి కడపి
"యిచట నుండుము, తావకాభీష్ట మిపుడు
చేయుదు" నటంచుఁ బైతృష్వసేయు నిలిపి 87

## యాదవుల రైవతకోత్సవ సన్నాహములు

ఉ. ద్వారక కేఁగి యందు బుధవర్గము బంధుజనంబు లాప్తులున్
గోరి భజింప నుండి యొకకొన్ని దినంబుల మీఁద భక్త మం
దారుఁడు వాసుదేవుఁడు ముదంబున రైవతకాచలోత్సవ
శ్రీ రచియింపఁగా వలయు రే పని మంత్రులఁ జూచి పల్కినన్. 88

ఉ. అప్పుడె వారుఁ దీర్పరుల నందులకున్ సమకూర్ప జాళువా
యొప్పుల కుప్ప లై మెఱయుచుండెడు మేరువులుం గురుంజులున్
జప్పరముల్ వితానములు సర్వము నాయితపెట్టి కానుకల్
దెప్పలుగా నమర్చి రతి తీవ్రత రైవతకాచలంబునన్ 89

చ. అపు డొక మాట కంసరిపుఁ డానతి యిచ్చెనొ లేదొ మంచి చొ
క్కపుఁ గపురంపు గిన్నియలు కస్తురివీణెలు రాశిగాఁగఁ గొం
డ పొడవు దెచ్చి వైచి రచటన్; మఱి తక్కిన వస్తు లంటిమా
యపరిమితంబు; లే మనఁగ నవ్విభు పట్టణ భాగ్య సంపదల్! 90

తే. గంధ మాల్యాభరణ వస్త్ర కలితు లగుచుఁ
గామినీ రత్నములుఁ దారుఁ గలసి మెలసి
చనిరి రైవతకోత్సవంబునకు నపుడు
వీరు వారన క య్యదువీరు వారు 91

చ. కలయఁగఁ జెంద్రకావి అవికం బలెఁ గుంకుమఁ బూసి చూడు మో
పొలఁతుక! నాదు నే' ర్పనినఁ 'బూసిన యట్లనె లెస్స యున్నదే,
బళి!' యని కేళినీ రమణి పల్కిన నవ్వుచు శంబరారి య
ర్మిలిఁ గయిసేసి యేఁగిరి గిరిం గన నా రుచిరాంగు లిర్వురున్ 92

ఉ. రేవతి గుబ్బచంటి మకరీమయ రేఖ లురఃస్థలంబునన్
భావజ చిహ్న ముద్ర లయి భాసిల, మేలిమి కందు దుప్పటిన్
బై వలెవాటు వైచి, నును మైజిగి గందపుఁ బూఁతయై తగన్
రైవతకాద్రి కేఁగె బలరాముఁడు కేళి కళాభిరాముఁడై 93

క. నగధరుని వెంట నడచిరి
మిగులం గై సేసి, యటఁ దమిం గస్తూరీ
భుగభుగలు నుదిరి బంగరు
నిగనిగ నెఱ యందె రవలు నెఱయం దెఱవల్ 94

చ. పురజను లింపునం గనఁగఁ, బొంతల రుక్మిణి సత్యభామయున్
దొరయఁగఁ, దక్కు నార్వురును దోఁ జన, నా వెనుకం బదాఱువేల్
తరుణులు గొల్చి రాఁగఁ, బ్రమదంబునఁ గృష్ణుఁడు వట్టివేళ్ల చ
ప్పరముల నీడనే యరిగెఁ బట్టిన కానుక లెల్లఁ జూచుచున్ 95

క. ఆ గతి నరిగి సమస్త జ
నాగతి రైవతకగిరి మహామహ లీలా
భోగము కన్నుల పండువ
యై గాఢ కుతూహలంబు నడరం జేయన్ 96

ఉ. ము న్నతిభక్తిఁ బూజలు సమున్నతిఁ దా మొనరించి, యాత్మయో
షి న్నికరంబులం బిదప సేవ లొనర్పఁగఁ జేయుచుండె, నం
త న్నవరత్న హేమ రచితం బగు పల్లకి నెక్కి వేడ్క తో
నన్నలు రామకృష్ణులు రయమ్మున రమ్మని గారవింపఁగన్ 97

క. చెలియలు సుభద్ర వచ్చెన్
జెలియలు వేయాఱులు నిరుచెంతలఁ గొలువన్;
'దొలకరి మెఱపో యిది యని
తొలకరిదొర బిడ్డ వెఱఁగుతోడం జూడన్ 98

ఉ. యౌవత చూళికాభరణ మప్పుడు కొందఱు బోంట్లు ముంగలన్
రైవతకోత్స వాగత జనంబు బరాబరి సేయుచుండఁ, ద
ద్దేవత కర్చనా నతు లతి ప్రమదంబునఁ జేసెఁ బై పయిన్
దైవతరాజ నందను ధనంజయునిం బతిగాఁ దలంచుచున్ 99

తె. ఈ కరణిఁ బూజ లొనరించి, యిష్ట సఖులఁ
గూడి, య గ్గిర కందరాకూట తడ వి
నోద వైఖరు లెల్లఁ గన్గొనుచు సరస
గోష్ఠి నుండెడు పద్మరాగోష్ఠిఁ జూచి 100

## అర్జునుఁడు సుభద్ర రూపరేఖలఁ గాంచి పరవశుఁ డగుట

మ. మును విన్నది తా నప్పుడు
గనుఁగొన్నది యొక్కతీరుగాఁ దార్కాణై
పెనఁగొన్న మహాశ్చర్యం
బున నన్నరుఁడిట్టు లనుచుఁ బొగడం దొడఁగెన్. 101

ఉ. 'చూడమె దేవతాసతుల శోభనకాంతివిలాసవైఖరుల్
చూడమె నాగకన్యకల లోకమనోహరరూపసంపదల్
చూడమె మర్త్యకామినుల సోయగముం దమకంబు పెల్లు తీ
పాడఁగ? దీనివంటి యొఱపైన మిటారినిఁ జూడ మెందులన్. 102

క. చెక్కులజిగి చనుగుబ్బల
చక్కఁదనము మొగముతేట జడతీ రౌరా
చొక్క మగు దీనిఁ జూచినఁ
జొక్క మనం గూడ దెట్టి సుజ్ఞానులకున్. 103

ఉ. కన్నులు దీర్ఘముల్ నగుమొగం బవురా తలకట్టుతమ్మిపూ
పున్నమచందమామలకుఁ బొక్కిలి చక్కఁదనంబుఁ జెప్పఁగా
నున్నదె? మేలుబంతులు పయోధరముల్; మఱి కౌను సున్నయౌ
నెన్నిక కెక్కు బ్రాఁతఫల మివ్వరవర్ణినికి న్నిజంబుగన్. 104

తే. భ్రమరకమనోహరం బౌటఁ బద్మ మగును
తారకాహృద్య మగుట సుధానిధి యగు
రెంటి జగడాలు మోమున నంటి యుంట
నబ్జముఖి యంట లెస్స యీ యలరుఁబోఁడి. 105

సీ. ధారాధరము వెన్నుఁ దన్ని పుట్టినచాయ నున్నదీ బింబాధరోష్ఠివేణి
జక్కవకవ ఱొమ్ము త్రొక్కి నిల్చినజాడ నున్నవీ నవలాపయోధరములు
చిన్నప్రాయపులేఁడిఁ జెవులు పట్టాడించు గతి నున్నదీ రామకన్నుదోయి
నల్లచీమలబారు నడుము దాఁకినపోఁక నున్నదీ చెలువంపుఁగన్నెయారు

తె. విపులపులినంబు వెన్కకు వింగ నొత్తు నందమున నున్నది మందయానపిఱుఁదు
దీని కెనయైన లతకూనఁ గాన మా మనోజవ్రజాంగి యా జగన్మోహనాంగి. 106

క. సైకము నడుము విలాస ర
సైకము నెమ్మొగము దీనిమృదుమధురోక్తుల్
పైకముఁ దెగడు న్నవలా
పైకములో నెల్ల మేలుబంతిది బళిరా! 107

ఉ. ఇత్తరళాక్షి మేనిజిగి యేలిక మేలికడానిపైఁడి కీ
గుత్తపుగుబ్బలాఁడిజడకూఁకటి చీఁకటిమూలదుంప కీ
పుత్తడిబొమ్మకన్నుఁగవపోలిక వాలికగండుమీల కీ
బిత్తరిముద్దునెమ్మొగము పిన్నమ పున్నమచందమామకున్. 108

తే. కామినీమణి నిడువాలుఁగన్నుఁగవకు
నెన్నికకు రాని తొగజేకు లీడు సేఁత
తగదు తగ దిఁక నలినపత్రంబులందు
నీ డగునో యేమొ మాట వేయింట నొకటి. 109

క. మహిలో సరి గలదా యీ
మహిలోత్తంసంబుమేని మహిమకుఁ? దెలియన్
మిహికుందనపుసలాకన్
మిహికాకరరేఖ మించు మించున్ మించున్. 110

సీ. కలిగెఁబో యీయింతి కులుకుగుబ్బలఁజూడ శీతశైలాదుల సేవఫలము
కలిగెఁబో యీనాతివళుల యందముఁ జూడ గంగాతరంగముల్ గన్నఫలము
కలిగెఁబో యీరామకనుబొమ ల్పాడంగ మును ధనుష్కోటిలో మునుఁగుఫలము
కలిగెఁబో యీభామకటివిలాసముఁ జూడ భూప్రదక్షిణము సల్పుటకు ఫలము

తే. తోడుతోడనె యిటులు చేకూడవలదె తన్వి దీఱంగ నీతన్విఁ గూడి
సరససంభోగ సల్లాపసరణిఁ దేలు నాఁడు గా ఫలియించుట నాతపంబు. 111

క. అని కొనియాడుచు నుండన్
వనితామణి నంత నుత్సవము చేసి పురం
బున కన్పుచు మాయామునిఁ
గనుఁగొని యాహలి నితాంతకౌతూహలి యై. 112

## బలరాముఁడు కపట త్రిదండిని ద్వారక కాహ్వానించుట

తె. అతని నుత్తమయతియకా మతిఁ దలంచి
వినయమునఁ జేరి సాష్టాంగవినతిఁ జేసి
స్వాము లెందుండి యిచటికి వచ్చినారు
తీర్థయాత్రగ నది యెల్లఁ దెల్పుఁ డనిన. 113

క. హిమశైల సేతువుల మ
ధ్యమునం గల నదులు నిధులు నాశ్రమములుఁ దీ
ర్థములుం దాఁ గనుఁగొన్నవి
క్రమమునఁ దెలుపం బ్రమోద రసపరవశుఁడై. 114

మ. కలిగెన్ భాగ్యవశంబునం గనుఁగొనంగా మిమ్ము మమ్ముం గృతా
ర్థులఁ గాఁ జేయఁగ నాత్మలోఁ దలఁచి చాతుర్మాస్య మిచ్చోటనే
సలుపం గా వలె స్వామివా రని నమస్కారంబు గావించి ప్రాం
జలియై వేఁడిన సమ్మతించెఁ గుహనా సన్న్యాసి యుల్లాసియై. 115

తే. చెలువనేత్రవిలాసంబు చెవులు సోఁక
బాలకుచలీల యెదఁ జాలఁ బట్టి క్రాలఁ
గలికి నెఱివేణి చెలువంబు కాళ్లఁ బెనఁగ
నవలఁ బోలేక నిలిచె నయ్యర్జునుండు. 116

క. సీరియు నిటులా శౌనా
సీరియు నన్యోన్య సూక్తిసితమానసులై
పోరానికూర్మి నుండఁగ
నారామునికడకు నంత హరి సనుదెంచెన్. 117

## బలరాముఁడు సన్న్యాసిని సత్కరింప సుభద్రను నియోగించుట

క. చనుదెంచిన స్వాములకున్
వినతి యొనర్పు మని యిచట వీరల నిలువుం
డనినార ముపవనంబున
నునిచి మనసుభద్ర సేవ కొనరుపు మన్నన్. 118

తే. వయసువారును జక్కనివారు వీరు
మనసుమర్మంబు లేమియు మనకుఁ దెలిసి
యున్నయవి గావు సేవకు నునుపఁ దగునె
కన్నె నదియేమొ తెలిసికొమ్మన్న నతఁడు. 119

క. విరు మహాత్ములు ఘను లప
చారం బగు నిట్టులాడ సంయములకు మున్
గోరిక వెలయఁగఁ గన్యలె
గారా శుశ్రూష సేయఁ గాఁ దగువారల్. 120

ఉ. నెమ్మది సంశయింప కిది నీవొనరింపు మటన్న నట్లె కా
నిమ్మని యమ్మునిప్రవరుఁ గృష్ణుఁడు దోడ్కొని ద్వారకాప్రవే
శమ్మొనరించి యంతిపురిఁ జయ్యనఁ జెల్లెలిఁ బిల్వనంపి రా
వమ్మ సుభద్ర నీ యభిమతార్థము లెల్ల ఫలించు నియ్యెడన్. 121

శా. కామాదిస్ఫురణంబు లెల్ల నడఁగంగాఁ జేసి ధన్యాత్ములౌ
స్వాముల్ వీరలు వీరికిం పొదవు తేవన్ సేవ గావింపు మెం
తోమోదంబున నానతిచ్చి బలభద్రుండే నియోగించినాఁ
డేమో చెప్పితి నంచు నుండెదవు సుమ్మీ నీమదిన్ సోదరీ! 122

క. అని తత్కన్యాంతఃపుర
వనవంజులకుంసంజవనమునఁ గుహనా
ముని నుండఁ జేసి పలికెన్
నెనరు మదిం బొదల రుక్మిణిసత్యలతోన్. 123

క. అతఁ డెవ్వఁ డెఱుఁగుదురె మీ
మతిలోనన యుండ నిండు మనకుందనపుం
బ్రతిమ యగు సుభద్రకు నై
యతివేషముఁ బూనియున్న యర్జునుఁడు సుఁడీ. 124

క. తనమదిలో నితఁ డర్జునుఁ
డని తెలిసి సుభద్ర సేవ కరుగక యున్నం
జని మీరతనికి భోజన
మొనరింతురు గాని యూరకుండెదరు సుఁడీ! 125

మ. అతనిం బూజ లొనర్పుఁ డిప్పు డని నెయ్యం బొప్ప గోపాలుఁ డా
నతి యీ నర్మిలి మ్రొక్కి నిన్నుఁ గని యెన్నాళ్లోకదా యంచు వ
చ్చితివా యన్న! కిరీటి! కూర్మి కలదా చెల్లెండ్రపై నంచుఁ ద
త్సతు లేకాంతమునం బ్రియోక్తులను బూజల్ సేసి వీడ్కొల్పినన్. 126

తే. అన్నరుం డంత శ్రీకృష్ణుఁ డున్ననగరి
సరసఁ గన్నియరాణివాసమున నమరు
కేళివనిలోన నవరత్నకీలితంపు
బవిరిటాకుల చిన్నియుప్పరిగలోన. 127

తె. తెఱవ నెఱవంకబొమలును మెఱుఁగువాఁడి
చూపులును జూచి తనచేతిసూటి రోసి
యస్త్రసన్న్యాస మొనరించినట్టి సుమశ
రాసనుం డనఁ జెలిమీఁదియాస నుండె. 128

క. అందుండి మనసులోన ము
కుందుం డీగతి నొనర్చుకుశలత కతఁ డా
నందమును జెందుచుండఁగఁ
గొందఱు గారాబుచెలులు గొల్వఁగ నంతన్. 129

ఉ. చందురకావి పావడ పిసాళిరుచుల్ సరిగంచుఁజీరపై
జిందులు ద్రొక్క వేణి కటిసీమపయి న్నటియింప జాళువా
యందెలు మ్రోయ జంటిఱికంటి చనుంగవ పిక్కటిల్లఁగాఁ
జందనగంధి వచ్చె రభసమ్మున నమ్మునిరాజుసేవకున్. 130

## కుహనా సన్న్యాసికి సుభద్ర పరిచర్య

ఉ. వచ్చిన థౌలఁ గాంచి తలవంచి జపంబు నెపంబు వెట్టి వి
వ్వచ్చుఁడొకింతసేపు తనవంకఁ గనుంగొనకున్న మెల్ల నే
యచ్చట నిల్చి నిల్చి వినయంబునఁ జేరి కుచంబు లోరగా
హెచ్చినభక్తి మ్రొక్కి యనియెం జెలి యంజలిఁ జేసి యింపుగన్. 131

ఆ. ఓమహానుభావ యేవి గావలె దేవ
పూజ కిపుడు పత్రపుష్పఫల జ
లాదికములు దెత్తునా యనవుడు నట్ల
సేయు మనుచు నతఁడు సేయి సూప. 132

సీ. తన యరుణాధరంబునకు నీ డివి యన్న రమణ నేఱిచి పల్లవములు కొన్ని
తన తనూసౌరభంబునకు జో డివి యన్న చందాన వెదకి పుష్పములు కొన్ని
తన మధురాలాపమునకు దీ టివి యన్న పగిది నారసి తియ్యఁబండ్లు కొన్ని
తన లేనగవుతేటకును బాటి యివి యన్న పోల్కిఁ దేఱిచి హిమాంబువులు కొన్ని

తే. పత్త్రపుటికావిధూపలపాత్రికలను దెచ్చి వినయంబుతోడ నందిచ్చె నపుడు
పసిఁడి గాజులమిసమిసల్ పైకిఁ బొలయఁ జకితబాలమృగీచకచకితనయన. 133

ఉ. గెంటనిప్రేమ మేను పులకించెఁ గిరీటికిఁ బూ లొసంగి వా
ల్గంటి గిఱుక్కునం దిరుగఁ గమ్మని కస్తూరితావి గ్రమ్ముకో

గింటెపుగబ్బిగుబ్బలజిగిన్ వెలిఁ జిమ్ము నొయారిజిల్గుప
య్యంట చెఱం గొకింత దనయంగముపైనటు సోఁకి నంతటన్. 134

## అర్జున సన్న్యాసి – యనుష్ఠాన వైచిత్రి

క. చేసె జప మతఁడు కడువి
శ్వాసము చెలిచూపుబేడిసలపై నిగుడన్
జేసినయది జపమున్ మఱి
వేసినయది గాల మనుట వృథ గాకుండన్. 135

తే. భామమోమున వ్రేలురూపంబుఁ జూచి
ముదిత యెడఁబాయకుండెడు మూర్తిఁ దలఁచి
రమణి మైసగ మైన విగ్రహము నెంచి
ప్రోవుమని వేఁడుకొను దేవపూజవేళ. 136

తే. వినతిఁ జేసిన భిక్ష గావింపుఁ డనిన
మాఱు వడ్డింప నివి దెత్తుమా యటన్నఁ
బల్కు నారాయణా యనుభాషణంబె
యల నిజాలకు సన్యాసివలె నతండు. 137

క. భయభక్తుల నిటులా కృత
కయతిగ్రామణికిఁ గన్యకామణి శుశ్రూ
ష యొనర్చుచుఁ గొన్నాళ్లుం
డి యొకానొకనాఁడు దనదు డెందమునందున్. 138

ఉ. వాసవిరూపచిహ్నములవార్తలు మున్ విని యుండుదుం గదా
యా సొబ గెల్ల నేఁడు గన నయ్యెడు వీరలయందు నైన స
న్న్యాస మసంగతం బగు మహాసుకుమారుఁడు రాకుమారుఁ డీ
గాసికి నోర్చునే కలరెకా మఱి మానిసిఁ బోలు మానుసుల్. 139

క. అని సంశయ మొకయించుక
యును లే కెప్పటివడువున యువతివతంసం
బనువుగ నతనికిఁ బూజన
మొనరించుచు నుండె నంతికోద్యానమునన్. 140

సీ. కరము చాఁచి నవాంబుకలశ మీ విడివడ్డ కుంకుమాంకపుముద్దఁ జంకమెఱపు
ననలుదేఁబోఁ గాళ్లఁ బెనఁగు నంచ నదల్పఁ జూచు జంకెనవాఁడిచూపు బెళుకు

పూరెమ్మ వంచుచోఁ జాఱుపయ్యంట దాఁగిలిమూఁతలాడుగుబ్బల బెడంగు
పొలఁతి! కాయో పండో పోయినపనియన్నఁ జిలుకమాటకు నవ్వుసొలపుఁదేట

తే. మఱియు మఱియును జూడనే మనసువాఱె వారికుసుమఫలంబులఁ దేరఁ బనుచుఁ
దొలుతటివి చాల వని యావధూలలామ నే మనఁగ వచ్చు వివ్వచ్చునేమ మింక. 141

తే. తెమ్ము బంగారుకుండ జలమ్ము లనుచుఁ
దెమ్ము లతకూన మంచిసుమమ్ము లనుచుఁ
దెమ్ము బా గైనకొమ్మఫలమ్ము లనుచు
మించుఁబోఁడిని నేరుపు మించఁ బలుకు. 142

క. తుమ్మెదవలె నున్నది యిటు
రమ్మని నెఱికొప్పు నివిరి భ్రమసితిఁ దరుణీ!
కమ్మవిరినల్లగలు వని
క్రమ్మఱ మఱుపెట్టు గుట్టు కన రాకుండన్. 143

క. నిద్దంపు మేలి సొమ్ములు
దిద్దిన కస్తూరి బొట్టు దినచల్వలు నై
ప్రొద్దొక సింగారముతో
ముద్దియ చనుదేర మిగుల మోహాతురుఁడై. 144

చ. బలిమిని బట్టఁగా దివురుఁ బట్టిన నొప్పక యిట్ట టన్నచోఁ
బలువు రెఱింగిరేని నగుఁ బాటని కొంకుఁ దలం పెఱుంగకే
కలయఁగఁ జూచుటల్ తగవు గాదని యుండునతండు కాంత నె
చ్చెలుల నొకింత పాసి తనచెంత మెలంగుచు నున్న వేళలన్. 145

చ. అట జగదేకసుందరికి నై యతివేషముఁ బూని వచ్చినాఁ
డఁట తనచేయుభాగ్యమున నప్పువుఁబోఁడియె చెంత సేవ సే
యుట కని వచ్చియుండు నఁట యొక్కొకపట్టున నొంటి పాటు నౌ
నఁట యతఁ డెప్పు డెప్పు డను టబ్బురమే మదిఁ దత్తఱించుచున్. 146

ఉ. సుందరి రానిచో నెదురు సూచుచు నుండనె పట్టె వచ్చుచో
నిందునిభాస్య చక్కఁదనమే కని చొక్కుచు నుండఁ బట్టె నీ
సందడిచేతనే యరుగసాగెను బ్రొద్దిఁక వేళ యెప్పుడో
సందె జపంబు నర్చనలు సల్పుటకా కపటత్రిదండికిన్. 147

తే. వెలఁది కెమ్మోవిఁ గని జపావృత్తి మఱచెఁ
దరుణిలేఁగౌను గని హరిస్మరణ మఱచెఁ
గడమ యన నేల వేస మొక్కటియ తక్క
మరచె నన్నియు నా కృత్రిమత్రిదండి. 148

మ. ఒడలుపొంగు నొయారిఁ జూడ జవరాలొద్దన్ మెలంగన గగు
  ర్పొడుచున్ ముద్దులగుమ్మ గంధసుమంబుల్ చేతి కందిచ్చున
  ప్పుడు వ్యాపారము లన్నియు న్మఱచు నప్పూఁబోఁడి రాకుండినన్
  గడె సేపొక్క మహాయుగంబు కరణిన్ గన్పట్టు రాచూలికిన్. 149

క. ఆనంద బాష్పములచే
  నాని వధూహావభావనటనలఁ దనలోఁ
  దాన తలపోయువానికి
  స్నానం బేమిటికిఁ వేఱె జప మేమిటికిన్. 150

క. ఈరీతి నుండ నొకనాఁ
  డారాజకుమారి యతని కాహార మిడన్
  జేరి తదారామంబునఁ
  గూరిమి నెచ్చెలులు వెంటఁ గొని తేరంగన్. 151

క. వెస లలనామణి బంగరు
  వెసలల దొంతరలు డించి వినయము మది కిం
  పొసఁగఁగ గంకణరవములు
  పొసఁగఁగ నారసి రసాన్నములు వడ్డింపన్. 152

చ. చిలుకలకొల్కి వేయెడమచేముడి గొల్పెడు జాఱుకొప్పు నిం
  పులు తులకింపుచుండు భుజమూలరుచుల్ జిలుఁగుం బయంటలోఁ
  గులుకుమిటారి గబ్బిచనుగుబ్బలుఁ జూచుటె కాని క్రీడి క
  ర్మిలి మఱి లేదు భోజనముమీఁది యపేక్ష యొకించుకేనియున్. 153

తే. రమణి యొయ్యారములపైఁ బరాకుచేతఁ
  జవి యెఱుంగఁడు వడ్డించునవి యెఱుఁగఁడు
  భోజనము చేసి లేచె నారాజసుతుఁడు
  తృప్తి యేరీతి నుండెనో తెలియరాదు. 154

క. అపు డతిరయమునఁ బన్నీ
  రపరంజి పసిండి గిండియందుం గొని తాఁ
  జపలాక్షి తెచ్చి యొసఁగం
  గపటపుసన్న్యాసి ధౌతకరపంకజుఁడై. 155

క. నిగనిగని చంద్ర కాంతపు
  జగతిపయిం గూరుచుండ జవ్వని వెనుకన్
  బగడపుఁ గంబపుఁజాటున
  మొగ మించుక గానిపింప మురువు నటింపన్. 156

శా. కంగుల్ దిరిన పైఠిణీరవిక చన్కట్టంటి రాణింపఁగాఁ
జెంగల్వల్ నెరికొప్పునందు నొఱపై చెంతం గుబాళింపఁగా
బంగారందియ ముక్కునం గమిచి పైపై నంచ యెల్గింపఁగా
సింగారంబగు ముద్దుఁజిల్క తనకున్ జేదోడువాదోడుగాన్. 157

తే. ఏకతంబున వసియించి యిట్టులుండ
మదనమదనాగవలమానమానసాంబు
రుహుఁడు పురుహూతసుతుఁడు నేరుపునఁ బలికె
నాచకోరాక్షిఁ గ్రేఁగంటఁ జూచి యపుడు. 158

## సన్న్యాసి సుభద్రకు శకున శాస్త్రము చెప్పుట

తే. చెలువ! నిను రాజకీరంబు చెట్టవట్టెఁ
గలికి! నిను రాజకీరంబు కాలుద్రొక్కె
మంచిశకునంబు లివిగొ నామాటఁ జూడు
కన్నె! యీలోనఁ బెండ్లిగాఁగలదు నీకు. 159

క. అనవుడు లజ్జావనతా
ననతామరస యయి వీరు నాఁగ మహాత్మల్
తన చేసిన సేవకుఁగా
మన మలరి వచించి రనుచు మది నుత్సుక యై. 160

## సుభద్ర యర్జునుని వృత్తాంతమును యతి నడుగుట

తే. కురులు కెంపులబొగడల నెరయ దువ్వి
నిక్కుఁజనుగుబ్బలఁ బయంట చక్కఁ జేర్చి
పలికెఁ గలకంఠి మోమునఁ దెలివి తొలుక
ముత్తియపుముంగఱ యొకింత మోవిఁ గదియ. 161

మ. అవుఁగా మీ రిట మున్ను గన్గొనినచాయ ల్లేవుగా నాఁట నుం
డి విశేషంబులు గొన్ని మిమ్ము నడుగన్ వేడ్కయ్యెడు న్నాకు నె
య్యవి గన్గొంటిరి పుణ్యభూము? లట రాజ్యంబుల్ మనోజ్ఞంబు లె
య్యవి? యేయేపురముల్ గనంబడియె మీ కందంద మార్గంబునన్? 162

క. మి రింద్రప్రస్థముఁ గని
నారా? పాండవులఁ జూచినారా? సుఖులై
వారందఱు నొకచో ను
న్నారా? వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా? 163

సీ. ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబు పుడికిపుచ్చుకొను నెన్నడుమువాఁడు
నెఱివెండ్రుకలవాఁడు నీలంపునికరంపు మెఱుఁగుఁజామనచాయ మేనివాఁడు
గొప్పకన్నులవాఁడు కోదండగుణకిణాంకములైన ముంజేతు లమరువాఁడు
బవిరిగడ్డమువాఁడు పన్నిదం బిడి డాఁగ వచ్చు నందపువెన్ను మచ్చవాఁడు

తే. గరగరనివాఁడు నవ్వుమొగంబువాఁడు చూఁడ గలవాఁడు మేలైనసొబగువాఁడు
వావి మేనత్తకొడుకు కావలయు నాకు నర్జునుండు పరాక్రమోపార్జనుండు. 164

క. తడ వాయె భూప్రదక్షిణ
మడరింపఁగఁ బోయి యామహామహుఁడు పదం
పడి పుణ్యస్థలముల నె
న్నఁడు మీ రందందు నరుగ నరుఁ గానరు గా! 165

క. అన విని సమస్తభూములు
కనినారము తీర్థయాత్ర గావించునెడన్
గనుఁగొనినారము సంక్రం
దననందను ననిన ముద మెదం జెన్నొందన్. 166

ఉ. ఎచ్చటఁ గంటిరో విజయునిక్కువ నిక్కువ మౌనె? రాఁడుగా
యిచ్చటి కంచుఁ గోరికలు నీరికలెత్త రసోక్తిఁ బల్కఁగా
నొచ్చెము లేనిబీర మెద నూరఁగ నూఱఁగ సాగె వెంటనే
పచ్చనివింటివాఁ డపుడు పైఁదలిపైఁ దలిరాకు గైదువుల్. 167

ఉ. కోమలి యాగతి న్మదిఁ దగుల్పడఁ బల్కిన నవ్వి నిర్జర
గ్రామణిసూను మీరెచటఁ గంటిరొ యంటిని కన్నమాత్రమే
యే మని చెప్పవచ్చు నొకయించుక భేదము లేక యాయనే
మే మయి యున్నవారము సుమీ వికచాంబుజ పత్రలోచనా! 168

ఆ. తీర్థములను గ్రుంకి దేవతాసేవలు
చేసికొనుచుఁ బెక్కువాసరములు
గూడి యతఁడు మేము గోకర్ణమునయందు
నుంటి మనిన మచ్చెకంటి యలరి. 169

క. ఎక్కడ గోకర్ణం బన
నిక్కడి కది యెంతదూర మింతకు నతఁడీ

చక్కటికి వచ్చునొ లె
కక్కడనే యుండి యవలి కరుగునో? చెపుఁడా! 170

క. అని రాజవదన మాటికి
ననురాగము తేటపడఁగ నాడెడుమాటల్
విని జేజేరాకొమరుఁడు
వనజేక్షణ కనియె వలపు వడ్డికిఁ బారన్. 171

క. వేమారు గ్రుచ్చి గ్రుచ్చిపు
డే మీ యడిగెదవు మన సొకించుక నీ కా
భూమీశుమీఁదఁ గలదో
తామరసదళాక్షి! నాకు దాఁపక చెపుమా! 172

## సన్న్యాసి తానే యర్జునుఁడని బయట పడుట

ఉ. అక్కఱతోడ మంతనమునం దిటు వేఁడెదు గాన నంతయున్
నిక్కము గాఁగఁ దెల్పఁ దగు నీకటు లైన సురేంద్రసూతి యీ
దిక్కున నున్నవాఁ డనుచుఁ దెల్పినతోడనె మాట లాడకే
యెక్కడఁ బోదువో యని యొకించుక సంశయ మయ్యెడుం జెలీ! 173

క. ఆ కవ్వడి యతివేషముఁ
జేకొని యున్నాఁడు నీకుఁ జెంతనె యెన్నా
ళ్లో కలదు వచ్చి యింకను
నీకేలక మించు కైన నీ వెఱుఁగవుగా. 174

క. నీకై తపంబు జేసెద
నీకైవడి దాఁప నేల యే నర్జునుఁడన్
లోకోత్తరశుభలగ్నం
బో కోమలి నేఁడు గోర్కు లొడఁగూర్పఁగదే! 175

ఉ. నా విని యావినీలకచ నవ్వుమొగం బటు గొంత వంచియెం
తే వెఱ నివ్వెఱన్ మునిఁగి యీతనిఁ బార్థునిఁగా నొకింతమున్
భావమునం దలంచియును నమ్మక యమ్మకచెల్ల యూరకే
సేవ లొనర్చుచుంటి నని సిగ్గున దిగ్గున లేచి పోవఁగన్. 176

## అర్జునుఁడు గాంధర్వ వివాహ మాడుమని సుభద్ర నర్థించుట

తే. ఏల పోయెదు నిలునిలు బాల! యనుచుఁ
జిఱునగవు నెమ్మొగంబునఁ జెంగలింపఁ
దమకమున లేచి మరులేచి తత్కరాంబు
జం బొడసి పట్టెఁ జేసాఁచి సవ్యసాచి. 177

క. పట్టినమాత్రనె దేవకి
పట్టికరాబ్జము లలాటపట్టిక చెమటల్
వెట్టె గగుర్పొడిచెం జను
క ట్టొక యిసుమంత వీడెఁ గట్టుంగొంగున్. 178

క. మరుఁ డపుడు బేసితూపులు
ధరియించియు నేమి చెప్పఁ దరుణి న్నరునిన్
సరికోలలఁ బడ నేసెన్
గొరవంకరొదల్ చెలంగఁ గ్రొన్ననవింటన్. 179

క. ఆరీతిం జేపట్టి వ
రారోహన్ వేదిమీఁదికై రాఁ దిగువన్
దూరము వెస నరుగక యొ
య్యారముగా నమ్రవదన యై యుండంగన్. 180

క. ఏ మును చూచి యెఱుఁగ నిను
నీ మును ననుఁ జూచి యెఱుఁగ వీవును నిపుడీ
ప్రేమలు వినుకలినే పై
పై మన కిర్వురకుఁ బర్వెఁ బర్వేందుముఖీ! 181

ఉ. శారిక హారికంకణము సద్దున కంటుట గాదు కేలు మం
జీరఝుళంఝుళధ్వనికిఁ జేరుట గాదు పదంబు లంచ వా
గ్ధోరణిమాధురీమహిమకున్ శుక మానుట గాదు చెక్కులో
సారసగంధి నాకొఱకు సారెకు వేఁడెడు జాడ లిన్నియున్. 182

క. చిలుకలకొలి కిది నాతోఁ
బలుకంగాఁ గొంత సిగ్గుపడియెడు ముంజే
చిలుకా! నీతో నైనను
బలుకంగా రాదె? పలుకు బంగారఁటవే? 183

మ. రతికిన్ భారతికిన్ వినోదకథలం బ్రాగల్భ్యమున్ జూపి త
త్పతులం గూరిచి మాటవాసిఁగను పెద్దల్ గారె మీవార లా

చతురత్వం బిటc గొంత కానcబడ ని చంద్రాననన గూర్చినన్
బ్రతికింపంగదె ముద్దుcగీరము సుధాబంధూభవద్గీరమా! 184

ఉ. చంపకగంధిమోవి సరసంబగు బింబ మటంచు వట్టితే
లింపు టెలుంగుతోc దమి దలిర్పcగc బల్కినc జెక్కుగీcటి ని
న్నింపున ముద్దుపెట్టుకొని యెన్నcడు మన్ననసేయ నున్నదో?
పెంపుడుcజిల్క! నిన్నుc దనిపింతుc జుమీ చెలి నన్ను నేలినన్. 185

క. అని కేళిశుకముc బలికిన
మన మలరం గలికి పలికె మాటలతియ్యం
దన మింతంతనc గూడని
తన యధరసుధాసమగ్రతం దెలుపంగన్. 186

## సరసోక్తులతో సుభద్ర తప్పించుకొని పోవుట

తే. మేరలా యివి మీయంతవారలకును
బెద్ద లున్నా రెఱిcగి వారె పెండ్లి సేయc
గలరు వేగిరపా టింత వల దటంచు
విన్నపము చేయరాదె యోచిన్నచిలుక. 187

తే. అని యుచితరీతి వెలయcగ నాడు నాతి
రసికముద్రకు మిగులమానసము గరcగ
పైపయిం బ్రేమ యగ్గలం బై పెరుంగ
నవ్వధూటి నొడంబడ ననుc గిరీటి. 188

క. మీవా రెఱుcగుట యెన్నcడు?
కావించుట యెన్నc డింకc గళ్యాణంబున్?
నీ వేల జంపు నడపెదు?
రావే మారాడ కిందు రాకేందు ముఖీ! 189

సీ. నన్ను గాంధర్వంబునను బెండ్లియాడవే సి గ్గేల పడియెదే? చిగురుcబోణి!
రతిc దేల్చి మదనసామ్రాజ్య మేలింపవే తల యేల వంచెదే? జలజగంధి!
చెలులు వచ్చెదరు నాతలcపు లీడేర్పవే తడ వేల చేసెదే? ధవళనయన!
మది నిచ్చగించి నామనవి యాలింపవే కడ కేల పోయెదే? కంబుకంఠి!

తే. మనసు దాcపంగ నేటికే? యనుపమాంగి! చలము సాధింప నేటికే? చంద్రవదన!
మాఱుమాటాడ వేటికే? మధురవాణి! చింత సేయంగ నేటికే? దంతిగమన! 190

క. గబ్బిమరుం డొఱ వెఱుఁగక
గొబ్బునఁ బైఁ బడును నీవుఁ గూడనివార్తల్
సుబ్బినఁ గార్యం బెక్కడఁ
దబ్బిబ్బో కా కపూర్వతనుబిబ్బోకా. 191

క. మీఁదన్ వియోగసాగర
మీఁదన్ గలవా లతాంగి యే మెఱుఁగవయో!
యీఁదా డన్నను మదనుఁడు
కోఁదా డనువాఁడు బిగువు కొనసాగునొకో. 192

క. ఏలే యాలేఖ్యాకృతి
యే లే ప్రాలేయకరముఖి చూడవయో!
యేలే? శైలేయస్తని!
యేలే బాలేందునిటల? యే లాఁతినఁటే? 193

సీ. ఆ హార మింపౌ కుచాగ్ర మానక యున్న నాహార మింపుగా దబ్జవదన!
చెఱకుఁబా లౌదువాతెఱ యానిచోఁ గంతు చెఱకుఁ బా లౌదునే చిగురుఁబోఁడి!
కళలు దేరెడునెమ్మొగంబు ముద్దిడ కున్నఁ గళలుదేరవు సుమీ కంబుకంఠి!
వలపేనిదురమున నలరింప కున్న నవ్వల రే నిదుర రాదు కలువకంటి!

తే. నేఁడు కాదు గదే ప్రేమ నీకు నాకు నాటి యున్నది మదిఁ జిన్ననాఁటినుండి
యిటుల నేకాంతసమయ మెన్నఁటికి దొరకు? నేల తప్పించుకొనియెదవే? లతాంగి! 194

మ. అని బాహాపరిరంభ సంభ్రమరసాయత్తైక చిత్తంబునన్
దను నీక్షింప నెఱింగి యందియలమ్రోఁతన్ గేకినుల్ రా సఖీ
జను లేతెంచి రటంచు వే మొఱఁగి హస్తంబున్ విడంజేసి నే
ర్పునఁ దప్పించుక పోవ భూవరుఁ డనుం బూఁబోఁడికిం గ్రమ్మఱన్. 195

క. కలహంస కేకిశుకములు
పిలపిల నేతేర నీవు పెంచిన వనిగా
తలఁచెదవు మరుఁడు పైఁగా
వలిఁ బెట్టిన దెఱఁగి తిరుగు వనజాతముఖి! 196

క. వెలిదమ్మి కలువ కొలఁకుల
యెలదెమ్మెర లొలయ వాని నెగఁ బోయుచు నో
చెలి! జు మ్మని విరహులకుం
దలదిమ్ము ఘటించుఁ దుమ్మెదలది మ్మిచటన్. 197

సీ. కలకంఠి! నీకటాక్షము గల్గ నిన్నాళ్లు మరుశిలీముఖముల సరకుసేయ
నతివ! నీ యాభిముఖ్యము గల్గ నిన్నాళ్లు చందమామ నొకింత సడ్డసేయ

రమణి! నిప్రియవచనము గల్గ నిన్నాళ్లు కలికి రాచిలుక లక్ష్యంబుసెయఁ
గొమ! నీకరావలంబము గల్గ నిన్నాళ్లు లేమావిచిగురాకు లెక్కసేయఁ

తే. జూడక మొగంబు ద్రిప్పి మాటాడ కిపుడు చేదిగిచి పట్టుక పరాకు చెప్పినపుడె
యేమి పుట్టునొ కైలాట మింకమీఁద మగువ! దయ లేక విడనాడఁ దగునె నీకు. 198

క. మొక మెఱుక కలదు గదవే
మకరాంకునియనుఁగు మేనమామకు నీకుం
దికమకలు సేయ వల దను
మకటా మేడపయి కేఁగునపుడైనఁ జెలీ. 199

వ. అని యనేకప్రకారంబులం దన మనోఽనురాగంబు తేటపడం బలికినఁ జెలుల నఱయు
నెపంబునం బరాకు చేసికొని చిఱు చెమట క్రమ్ము నెమ్మొగంబు మకరందబిందు
కందళితారవిందంబు చందంబునం దనర నరవీఁడు కుచ్చిళ్ల నెత్తి చెక్కుచు నొక్కింత
జాఱుపయ్యంటఁ జక్కం జేర్చుచు నొక్కింత వదలువేనలి నలవరించుచుఁ గొండొక
చెదరుపాపటఁ గుదురు కొల్పుచుఁ జక్కెరవిల్తుం డెక్కడ వెన్నాడునో యను
భయంబునంబోలె నించుకించుక తిరిగి చూచుచు ననుగత కేకిహంసంబులపై
వెగటునంబోలెఁ జలించుచు నీయొళపు సకియలకుం జెప్పకు మని రాచిల్కకుఁ బ్రియంబులు
సెప్పుచు మగతేఁటి యంటియంటని ప్రసూనకళికపోలిక నరవిరి బాగుతోఁ బోలి
కప్పురంపుటనంటుల నంటు ద్రాక్షపందిరుల తెరువులఁ బూఁ దేనె కాలువలు దాఁటి
చెంగలువ బావుల డగ్గఱి కుంకుమనీటికేళాకూళియోరవట్టి వట్టివేళ్ల చప్పరంబులనీడ
వ్రీడాభరం బీడిచికొని పోవ నివ్విధంబున. 200

క. ఆఘనునిఁ బాసి మంజీ
రాఘోషము మెఱయ నరిగె నంతఃపురికిన్
వే ఘనజఘన తళుక్కన
మేఘము నెడఁబాసి పోవుమెఱుపో యనఁగన్. 201

క. ఎటువంటి నేర్పరి నిశా
విటునల్లుఁడు నడుమ నిల్చి వెడసింగిణిచే
నటు చూ పిటు నిటు చూ పటుఁ
బటురయమున నేసె నాసుభద్రార్జునులన్. 202

తే. కోపమగువారి బెదరించి కూర్పనేర్చుఁ
గూడమనువారిఁ దమిఁ గొల్పి కూర్ప నేర్చుఁ
గొమ్మలకు మగలకుఁ బెండ్లిఁ గూర్ప నేర్చు
జగతి నెంతటియుపకారి శంబరారి. 203

## ఆశ్వాసాంతము

శా. దాక్షిణ్యాకరమూర్తి! షోడశమహాదానాదిపుణ్యక్రియా
దక్షా! యాశ్రిత దీన రక్షణకళా ధౌరంధరీ సత్కృపా
వీక్షా! శాశ్వతకీర్తి వైభవ రమా భృచ్చోళసింహాసనా
ధ్యక్షా! దుర్దమరాట్కిరీటదళనైకాక్షేయ కౌక్షేయకా. 204

క. కలహారంభణకౌతూ
హలపులకిత భుజపరాక్రమార్జిత నానా
జలదుర్గవనీదుర్గ
స్థలదుర్గాహార్య దుర్గసామ్రాజ్యనిధీ! 205

స్రగ్విణి. దుగ్ధవారాశివిద్యోతికీర్తీ! సుధా
భుగ్ధురీణామనాగ్భోగవర్తీ! దయా
దృగ్ధుతాశేషధాత్రీమరున్నిస్స్వతా!
స్నిగ్ధసారస్వత స్నిద్ధసారస్వతా! 206

గద్యము. ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ ప్రసిద్ధ సారస్వత సుధాసార జనిత యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్యతనయ వినయ ధురీణ సకల కళాప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ భూపాలదత్త హస్తముక్తాకటక విరాజమాన వేంకట కవిరాజ ప్రణీతంబయిన విజయవిలాసంబను మహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసమ్

---

# తృతీయాశ్వాసము





జానకీ మనోహర
పూజాంచిత హృత్పయోజ! పోష్యాఖిల ది
గ్రాజ! సకలార్థిజన ని
ర్వ్యాజకృపా! యచ్యుతేంద్రరఘునాథమణీ! 1

తే. అవధరింపు కథాకర్ణనాతివేల
హర్షులైనట్టి దివ్యమహర్షులకును
తతసమస్త పురాణ కథా శతాంగ
సూతుఁడై విలసిల్లెడు సూతుఁ డనియె. 2

అర్జునుని మదన తాపము

క. ఆరీతి నంతిపురమున
నారీతిలకము సకీజనంబులు గొలువం
జేరిన పిమ్మట మదిలోఁ
గూరినపిమ్మట విరాళిఁ గొని నరుఁ డుండెన్. 3

తే. కృష్ణననుమతి రుక్మిణీకీరవాణి
వచ్చి భోజన మిడఁ దలవంచి యగ్గ
లంబయినచింత వలసియొల్లమి నతండు
సొగటులను బోయి కసిగాటులుగ భుజించె. 4

తే. మునుపు సైఁపదు సంతోషమున భుజింప
వెనుక సైఁపదు చింతచేతను భుజింప
బాలకడ నున్న యపు డెడఁబాసినపుడు
నొక్కతీ రయ్యె భరతవంశోత్తమునకు. 5

ఉ. ఎక్కడఁ జప్పు డైనఁ దరలేక్షణ వచ్చె నటంచు లేచు నే
దిక్కున నల్కు డైన సుదతీమణి పల్కని యాలకించు నే
చక్కిఁ దళుక్కుమన్న నలజవ్వనిమైసిరి యంచుఁ జూచు న
మ్మక్క! కిరీటిమోహసముద్రగత నే మనవచ్చు నయ్యెడన్? 6

ఉ. చక్కెరకెంపుమోవిఁ గని సారెకుఁ జిల్క మొగంబు వేఁడఁగాఁ
జొక్కపుఁ జిల్వకప్పుజడఁ జూచి మయూరము లబ్బు సాఁపఁగాఁ
జక్కని తమ్మిపూవడుగుజాడలఁ గన్గొని రాజహంసముల్
త్రొక్కుడుపాటు చెందఁగ వధూమణి వచ్చుట లెంచు నెమ్మదిన్. 7

తే. మారుతమ్ములవాడికి మలయకూట
మారుతమ్ములవేఁడికి మట్టుమీఱు
చంద్రకిరణమ్ములకు శుకశారికాళి
చంద్రకిరణమ్ములకుఁ జాల జలదరించు. 8

చ. 'విరహిణులం గలంప గలవీరులు వీ రని తమ్ముఁ జేర న
య్యురుకుచ వాలుఁజూపులకు నోడుట నంకము కాఁగ మీనమున్
హరిణమునట్లనే తమశరాంశుల నోడెనొ కాక బాలికన్
గరఁపఁగ రాదె యేల ననుఁ గ్రాఁచెదరీ మకరైణ లాంఛనుల్. 9

క. ఇన్నాళ్లు సేవ సేయుచు
నున్నదియుం బోయె నేఁ డయో! కౌఁగిలి యి
మ్మన్నంతఁ జదుపఁ బెట్టఁగ
నున్నమతియుఁ బోయె నను టహో నిజ మయ్యెన్. 10

తే. అంతిపురమున కరుగుచో నింతి తిరిగి
యోరగాఁ జూచునపుడు శృంగారరస మ
పారముగ నుబ్బ జాలెత్తె నౌర! దాని
చలమనోహరలోచనాంచలమ చెలమ. 11

సీ. అర్జునుం డను నేనె యని తెల్పినంతనే మిట్టిమీనై పడె మెలఁతచూపు
గాంధర్వమునఁ బెండ్లి కమ్మనునంతనే పచ్చకప్పుర మయ్యె భామపల్కు
బలిమిమైఁ బట్టంగఁ దలకొనునంతనే యొకబండి కల్లయ్యె నువిదపిఱుఁదు
సొలపుఁబయ్యెదఁ దేటి చూతు నన్నంతనే పచ్చపూసాయెఁబో పడఁతియారు
తే. పేరు వివరించి నే నేల బేల నైతిఁ? గోర్కి యెఱిఁగించి నే నేల గోల నైతి?
బలిమిఁ బైఁ బడి నే నేల బయటఁ బడితి? బత్తి గనిపించి నే నేల పలుచనైతి? 12

సీ. తెఱువ కస్తూరిచుక్క దీర్చి వచ్చినటెక్కు గీఱునామము నాఁటితీరుఁగేరుఁ
దన్వంగి వలిపంబుఁ దాల్చివచ్చినఠీవి వన్నెఁ గట్టిననాఁటిచెన్నుఁ దన్ను
వాల్గంటి కీల్గంటు వైచి వచ్చినచెల్వు జడ యల్లుకొనునాఁటిసౌరు జౌరు
నొయ్యారిమెఱుఁగు సొమ్మూని వచ్చిననీటు మణిభూష లిడునాఁటిమట్టుఁ దిట్టు
తే. నాతిరాయంచగుమి గూడి నడుచుమురువు చెలులు గొల్వంగఁ జనునాఁటి సొలపు
నలఁపుఁ
జక్కఁ దనముల ప్రోవైన చంద్రముఖికి నిచ్చలపురూపు లెస్సైన నింపు నింపు. 13

ఉ. మిక్కిలి తెఱచూడ మిఱుమిట్లులు గొల్పుఁ జరించునప్పు డ
మ్మక్క! తళుక్కునన్ మెఱసిన ట్లగు నే మన వచ్చు? నద్దిరా!
చొక్కపుఁ బైఁడిబొమ్మ యనుచున్ జను లాడిన నాడిరింతెకా
కెక్కడికేడ పో యలమృగేక్షణమేనికి నక్కడానికిన్? 14

ఉ. చిత్తజుఁ డల్గి తూపు మొనచేసినఁ జేయఁగ నిమ్ము పై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్ము వచియించెదఁ గల్గినమాట గట్టిగా
నత్తరళాయతేక్షణ కటాక్షవిలాసరస ప్రవాహముల్
కుత్తుగబంటి తామరలకుం దలమున్కలు గండుమీలకున్' 15

క. అని తాల్మిఁ బాయు 'సేవకు
నని యెప్పటివలెనె తిరిగి యరుదేర దొకో!'
యని యాస సేయు 'వచ్చిన
నన్నృతోదరి నింక విడువ' నని తలపోయున్. 16

సీ. విరహాగ్ని కోర్వక విధి దూఱుకొనెడు తాఁ దపసివేషం బేల తాల్చినాఁడు?
కడలేనిసెకలఁ గందెడు ఘనోదయవేళఁ దెలిసియుఁ దా నేల వలచినాఁడు?
శుకశారికార్భటులకుఁ దల్లడిలెడు తా నుపవనంబున నేల యుండినాఁడు?
కరగతస్వము పోవుకరణిఁ జింతిలెడు తా వెలఁది నేటికిఁ బట్టి విడిచినాఁడు?
తే. నేరముల నెంచెద మటన్న నేరికైనఁ గలవు పరికించి చూడ నందులకు నేమి?
యంగసాంగత్యపారవశ్యమునఁ గాక యెఱిఁగి యుండిన నతఁడు చే యేల విడుచు? 17

తే. ఉనికి శృంగారవన మఁట! యొంటిఁ దగిలె
నఁట! విరహి యఁట! యెంత సేయఁడు కిరీటి
నసమశరుఁ డింకఁ దనవైరి యగు లలాట
లోచనుని గెల్చు నని దయఁ గాచెఁ గాక. 18

## సుభద్ర విరహాతిశయము

క. ఇటుఁ లాతఁ డుండఁగా న
క్కుటిలాలక యంత నచటఁ గుసుమశరార్తిన్
బెటిలిపడి పాన్పుపై న
ట్టిట్టు వడి తనలోనఁ దానె యేకాంతమునన్. 19

క. 'ఏఁ గోరినచెలువుఁడె ననుఁ
దాఁ గావలె నంచు వచ్చి దగ్గఱి వేఁడం
గౌఁగిలి యీ కిట వచ్చితి
నౌఁ గా దని పెనఁగి యెంత యవివేక మయో! 20

ఉ. దిగ్గున లేచి న న్నతఁ డతిప్రమదంబునఁ జందమామఁజా
నిగ్గుటరంగుమీఁదికయి నెమ్మిఁ గరాబ్జము వట్టి యీడ్చినన్
బిగ్గఁ గవుంగిలించి సుఖనీరధిఁ దేలఁగ నీక నా కయో!
సి గ్గనుపేర వెంటఁ బడఁ జెల్లు నొకో ప్రతిబంధమయ్యెడన్? 21

క. తొల్లిటివలె సేవకుఁ బోఁ
జెల్లునె? మావారు పెండ్లి సేసెద రిదిగో!
నెల్లిఁ దమ కంచుఁ బలికితి
నెల్లిద మగుఁ గాదె తిరిగి యేఁ బై కొన్నన్. 22

సీ. ననుఁ దా వలచిపడ్డ నలఁకువల్ దీరంగఁ గైసేయ నెనఁడు గలుగునొక్కొ?
పెనఁగి చే విడిపించుకొనిన నేరమి పోవఁ గెలన నెన్నఁడు నిల్వఁ గలుగునొక్కొ?
ప్రియ మెఱుంగక యడ్డపెట్టు తుందుడుకువోఁ గల్యాణ మెన్నఁడుగలుగునొక్కొ?
మోహతాపము దీఱ మోవిచక్కెర పానకమున నెన్నఁడు దేల్పఁ గలుగునొక్కొ?
తే. యొంటి శృంగారవనములో నునిచి వచ్చి నట్టి నెంజిలియెల్లఁబో నానృపాల
తిలకుఁ జేర్పంగ నెన్నఁడు గలుగునొక్కొ యాము కవిసినకుచకుంభసీమయందు?' 23

క. అని యెంచరాని కోర్కులు
మనమునఁ దలపోయు భావమగ్నతచేతం
గనుమూయుఁ గలసినట్టులు
గని సంతస మందుఁ దెలిసి కళవళ మందున్. 24

సీ. ఉదయాద్రి యెరగలి నొరసి మీఁద వెలుంగు జలజారి వేఁడివెన్నెలలు గాయ
హరుకంటిసెగ కోర్చి యాఱితేఱిన మారుఁ డలరుఁజిచ్చుఱవాఁడిములుకు లేయఁ
బాముకోఱలతోడ సాము చేసినగాడ్పు విసపువిత్తై సోఁకి వెగటు చూపఁ
గౌంచాచలముపోటుగంటి దూరిన రాజహంసమ్ము ల్వడి హళాహళులు చేయ
తే. వేగునంతకు వలవంత వేఁగునంత నంతిపురమునఁ బ్రమదవనాంతరమునఁ
గృష్ణకృష్ణా యటంచు నాకీరవాణి రామరామా యటంచు నారాజసుతుఁడు. 25

క. చెలులు ప్రసంగవశమ్మున
నలరెం గడువిజయభవన మనిన న్నవలా
తెలియ వినుం గలయఁ గనుం
బలుమాఱు బాగౌఁ గిరీటిపచ్చ లటన్నన్. 26

క. మనమున నున్నది మొగమునఁ
గనిపించుం గాన గట్టిగా మదిలో న
ర్జునభావ మునికి నపు డ
ర్జునభావము మొగమునందు సుదతికి నిల్చెన్. 27

## వదినెలు సుభద్రతో మేలము లాడుట

సీ. 'పులకించె మె నేమి తలఁచుకొంటివె?' యంచు మేలంబుపచరించె మిత్రవింద
'యిన్నాళ్లవలె మన సిచ్చి మాటాడవే! యెందు దృష్టి?' యని కాళింది తెగడెఁ
'జెలి పెండ్లికతఁ జెప్పఁ జెవి యొగ్గి వినవేమి? కలదు లే' యని గేలి సలిపె భద్ర
'వలపువాసన మించెఁ గలికి! నీమొగ' మంచుఁ ద్రస్తరి నెఱపె సుదంత కొంత
తే. జాంబవతి నవ్వె లక్షణ సరస మాడె నే లగడుచేసెదరె ముద్దరాలి ననుచుఁ
బలికె రుక్మిణి సత్య కన్గిలిపె నపుడు చిన్నిమరఁదలిమోహంపుఁజిన్నె లెఱిఁగి. 28

క. 'అంగన! యిన్నాళ్లును ముని
చెంగటికిం బాటిపాటి సేవలు గావిం
పంగాఁ బోదువు నేఁ డటు
తొంగియు జూడ వతఁ డేమి దోసము చేసెన్? 29

ఉ. అక్కఱఁ జూడ వేటి కల యచ్చిక బుచ్చిక సేయు నంచలం?
జెక్కిలిగొట్టె దేమిటికిఁ జేరఁగ వచ్చినముద్దుఁజిల్కలన్?
ముక్కు మొగంబుఁ జూడ కటు ముట్టను బొమ్మనె దేల బోట్ల నో
చక్కెర బొమ్మ! నీవెగటుజాడలఁ జూచిన వింత లయ్యెడున్. 30

ఉ. ఎవ్వనిఁజూచి మేలుపడితే? యరవిందదళాక్షి! నీమనం
బెవ్వఁడు సొచ్చెఁ జెప్పఁగదవే మదకోకిలవాణి? నిన్న నేఁ
డెవ్వనిచెల్వు నీయెదుట నెన్నఁ బడెన్ వినతాంగి? నేనె కా
కెవ్వరు నీకుఁ బ్రాణపద? మేటికి దాఁచెదవే తలోదరీ! 31

ఉ. బాలసమీరణంబు పయిపాటున నించుక సోఁకినం గడుం
దూలుచు నుండు దానవు వినోదపుసుద్దులముద్దుఁజిల్కపై
వ్రాలినఁ గందుఁ గేలు పువువంటిది నీ నును మేనిదే గతిం
దాళు నొకో వియోగశిఖి దా నెదలో దరికోఁ దలోదరీ!' 32

క. అని వారికి వా రందఱు
మనమునఁ దోఁచినటు లాడుమచ్చికమాటల్
విని సిగ్గున నయ్యెలజ
వ్వని యూరక యున్న నపుడు వారలలోనన్. 33

ఉ. 'లెంకఁగ నేలుకోఁ గలదులే మగనిం దరితీపు సేసి మీ
నాంకునిపొద మాన మన మాదట వేఁడిన మాఱు పల్కఁగాఁ
గొంకెడు నంచు మీ రిపుడు గోలని చూడకుఁ డమ్మ! నేర్చు బో
చంకలబిడ్డ లూడిపడ సారసలోచన మాటలాడఁగన్. 34

తె. క్రాఁగి యున్నది మిగుల నంగంబు చూడఁ
గలవరించుచు నున్నది కలదో యేమో
సోఁకు డల్లసన్న్యాసికే చూపవలయు
భామ' నని పల్కె నాసత్యభామ నగుచు. 35

క. 'ఈలీల నుండి మన మిటు
మేలము లాడంగ నేమి మిడిమేలమొ?' యం
చాలో సత్య సుభద్రహి
తాళుల కిసుమంత యారహస్యముఁ దెల్పెన్. 36

## చెలులు సుభద్రకు శిశి రోపచారములు గావించుట

క. గుసగుసలఁ బోయి వలపుల
కిసమస లని తెలిసి రసికకిసలయపాణుల్
బిసకిసలకుసుమవిసరము
వెసమసలక తెచ్చి శిశిరవిధాలాలసలై. 37

శా. పన్నీటన్ జలకంబు లార్చి చలువల్ పైఁ గట్టఁగా నిచ్చి మే
న న్నిండారఁగ జందనం బలఁది విన్నాణంబుగాఁ గప్పురం
పున్నామం బిడి క్రొమ్ముడిన్ విరిసరంబుల్ నించి హారావళుల్
చన్నుంగ్రేవలఁ దార్చి రప్పుడు చెలుల్ చంద్రాస్యకు న్నేర్పునన్. 38

సీ. బోటి మధువ్రతంబులకు దండము వెట్టి మకరంద మధరబింబమునఁ జిల్కెఁ
జెలి గంధవహున కంజలిఁ జేసి నెత్తావి పువ్వుగుత్తు లురోజమున నమర్చె
నాళి బిసాహారపాళికిఁ బ్రణమిల్లి నవమృణాళములు బాహువులఁ గూర్చె
సకి కెందలిరుదిండులకు వందన మొనర్చి చిగురుటాకులు పాదయుగళిఁ జేర్చె
తే. సరఁగ నిటు లందఱును మీప్రసాద మనుచుఁ బంచసాయకదేవతాబలము నెల్ల
వేఁడికొని తగినట్లు కావించి రపుడు చంచలాక్షికి శిశిరోపచారవిధులు. 39

తే. కలయఁ బన్నీరు చిలికి శ్రీగంధ మలఁది
విరులు పైఁ దార్చ నపు డొప్పెఁ దరుణిమేటి
మగని నరు గెల్వ వలరాచమావటీఁడు
పూజ సేసిన యగ్గజరాజ మనఁగ. 40

ఉ. అంగనగుబ్బచన్మొఱుఁగుటందపు మేలిపసిండికుండలం
బొంగఁ దొడంగెజొబ్బిలఁగఁబూసినగందము తాపవహ్ని 'సం
పంగికటారివీరునకుఁ బాలును బియ్యము లేనిపొంగలో
పొంగ' లటంచు నయ్యలరుఁ బోడులు సారెకు గేలిసేయఁగన్. 41

పంచ చామరము. మెఱుంగుఁబోఁడి కిట్లు చల్వ మేర మిఱఁ జేసినం
గుఱంగట న్నిలంగరాక కూర్మి వెచ్చ హెచ్చఁగాఁ
దుఱంగలించు చింతతోడ దూఱి పల్కి రంత వే
మఱున్ మరున్ మరున్మృగాంకమత్తకోకిలాదులన్. 42

## మన్మథోపాలంభనము

క. 'విరివింటివాఁడవు గదా!
శరణాగతు లైన పాంథజనులను రక్షిం
తురు గా కిటుల నుపేక్షిం
తురె పైకము గూడఁ బెట్టఁ దొడఁగుచు మదనా! 43

క. అలరువిలుకాఁడ వమృతము
చిలికెడునెల యేల? సామిచేఁ గాదె వియో
గుల నేఁచఁగ? విండ్లమ్ములు
గలవారికిఁ దోడు చల్లకడవలవారే? 44

ఉ. చక్కని వారిలో మిగులఁ జక్కనివాఁడవు గాన నీకె నౌ
చక్కనవారిఁ చంద్రుని వసంతునిఁ గూరుచు కొంటి వందమౌఁ
జక్కెరవింటిరాజ! యెకసక్కె మదే మని కూర్చుకొంటి? వ
మ్మక్క! యరూపకం బయిన యా యెలదెమ్మెర నాలిబూతమున్. 45

తే. రమకు నట్టింటిపగవాఁడు కమలవైరి
కంసుఁ బోలినయుగ్రశేఖరుఁడు వాఁడు
మేనమా మని చూడకు మాను చెలిమి
యకట పైవచ్చు టెఱుఁగవే హరికుమార! 46

## మలయాని లోపాలంభనము

క. తరుణిమయితావియాసునఁ
బురికొల్పెడునిన్ను గందపుంగొండ యిటుల్
పురికొల్పెనె తానుం దా
మరకొలఁకులరమయు మలయమరుదంకురమా! 47

క. తెమ్మెర! నీ కెం తెమ్మెర!
కమ్మనివిలుకానిదొరవు క మ్మని నెలఁ బై
రమ్మని యళిపికశుకనిక
రమ్మని గా నిలిపి ముందరఁగ వచ్చితివా? 48

పంచ చామరము. జొహారు మికుఁ జల్లఁ గాఁగఁ జూడుఁడొ సమిరకం
జహారులార! మంటమారి శంబరారిఁ గూడి యీ
గొహారు సేయ నేల? యీ చకోరలోచనన్ భుజం
గహారుపాద మాన మీకుఁ గాఁక లింక రేఁచినన్. 49

## చంద్రోపాలంభనము

క. వల పెక్కడ లేదా? యీ
యలికుంతలతలనె వేగెనా? యేఁచ కిఁకం
జలికాలఁ ద్రోచి విడువుము
చెలి మిక్కిలి మనసుపేద శీతలపాదా! 50

చ. శివుఁడిటు రమ్మటంచు దయ చేసినచోఁ దలకెక్కి తుగ్రవై
భవమునఁ జూచుచో నడుగు వట్టితి వే మన వచ్చు నీగుణం
బవు నవు నందినన్ సిగయు నందక యున్నను గాళ్లుఁ బట్టుకొం
దువు హరిణాంక! వేలకొలఁదుల్ గద నీనడకల్ దలంపఁగన్. 51

తే. కలశవారాశిఁబుట్టుట క ప్పెనయుట
శైలచాపశిరోధివాసంబుఁ గనుట
యెవ్వరికి నంటరాకుంట యెఱిఁగి కాల
కూట మన నేమి నినుఁ జంద్ర! నేఁటనుండి. 52

తే. భువనజాతార్తికరమూర్తి వవుట కడలి
కడలి గరళంబు నిన్ను నొక్కటిగ నెంచి
త్రాగు తలఁ బోసికొమ్మని వేగ హరున
కిచ్చె నీరుచి యిఁక నెంచ నేల చంద్ర! 53

ఉ. చక్కెరవింటిరాజు నగచాపునితో నెదిరించి పడ్డనాఁ
డెక్కడ నుంటి వీవు మధుఁ డెక్కడనుండెను మందమారుతం
బెక్కడ నుండె సిగ్గు పడరే మిపు డాతఁ డదృష్టరేఖచే
రక్కొని క్రమ్మఱం బ్రతికి రాఁగ వజీర్లయినారుగా శశీ! 54

## కోకిలా ద్యుపాలంభనము

క. మా కలకంఠియు నీవును
నేకగ్రీవముగ నుందు రిన్నాళ్లు నయో!
కోకిల! యిపు డే లలఁచెదు?
నీ కగునే యిగురుఁబోఁడి నెత్తురు ద్రావన్. 55

క. కొమ్మపయిఁ బక్షపాతము
నెమ్మెయి నెఱపుదు వి దేల యేఁచెద వకటా!
క్రమ్మఁగ నవాతుచక్కెర
క్రమ్మఁగ మాటాడుఁతవర! కలకంఠవరా! 56

ఉ. కల్లరిత్రాఁచు నిప్పుకలు గైకొనుకేకి చకోరపాళికిం
జెల్లినఁ జెల్లుఁ గాక సరసీజబిసంబు లిగుళ్లు మేసి భా
సిల్లెడు మీ కయో! విషము చిల్కఁగ వేఁడిమి కుల్కఁబల్కఁగా
జెల్లునె యో మరాళపికశేఖరులార! వచింపుఁ డింపుగన్. 57

క. రాచిలుకా! కోమలిదెసఁ
జూచితె? శ్రుతికటువు లనెడుశుకనామము మీ
కే చాడ్పునఁ దగు వల దిఁక
మాచెలిఁ గెరలించితేని మాటలు వచ్చున్. 58

క. మదనుగుణం బని చాలఁగ
మది నమ్మితి మిట్లు మొరయు మరియా దగునే?
యదియును గాక మదాళులు
గద తుమ్మెదలార! వెగటుగా నాడెదరే? 59

వ. అని బహూకార నికార మమకార చమత్కారంబులు కానంబడ నీప్రకారంబున. 60

క. కరదబ్జముఖుల మాటికి
శరదబ్జముఖుల్ తలంపఁ జాల్ నిలుఁ డంచుం
దరుణీమణి వేసరి యా
స్తరణసుమాదులను జూపి తాపముచేతన్. 61

సీ. 'ఈక్రొవ్విరులు గ్రోలు నెలతుమ్మెదలు చెక్కు చెమరింప కున్నవా చిగురుఁబోఁడి!
యీ కెంజిగురు మెక్కు కోకిలానీకముల్ వసివాడ కున్నవా వనజగంధి!
యీనిండువెన్నెల లాను చకోరముల్ కసుగందకున్నవా కంబుకంఠి!
యీతూండ్లు భుజియించు జాతియంచలు సొట సొటలు వోకున్నవా శోభనాంగి!
తే. తెలిసి రా రమ్మ కలదు సందియము చాల నులికిపడ కవి లెస్సలై యుండెనేని
వజ్రకాయములే యౌను వానికెల్ల నపుడు విరహుల యవధికి నవధి లేదు. 62

క. చలిగాలి గర్వ మణఁపం
గలిగెం జిలువ లని యుండఁగా వానిపయిన్
గలిగె శిఖావళము లయో
చెలి తప్పునె వాయుసఖము శిఖి యనువార్తల్. 63

తరల. ఆగము లెక్కుచు మిన్ను ముట్టు చహంకరించు బలంబుతో
మృగమదంబు నడంగఁ జేయుచు మేనికప్పు చెలంగఁగాఁ
బగలు మీఱఁగఁ బాంధకోటుల బాధవెట్టుచు నుండు నీ
తొగతగుల్ వెడవింటిబోయకుఁ దోఁడు వచ్చినవాఁడపో. 64

క. మకరందరసముఁ జిల్కెడు
చికిలిలకోరీలు చెఱకుసింగిణివిల్లుం
బ్రకటించియు నిది యేమో
మకరాంకుఁడు చేఁదువగలు మానడు చెలియా! 65

చ. చిడిముడిపాటుతోఁ జెఱకుసింగిణిఁ బూని మధుప్రియత్వ మే
ర్పడుగతిలావు లున్నహరిపైని జివుక్కున నెక్కి యుక్కునన్
వెడలెడుచందుఁ జూచి తమి నేఁడిదిగోవధ మాచరించుఁ బెం
పడరి లతాంగి! పచ్చితురకౌఁ గద యమ్మదనుండు చూడఁగన్.' 66

తే. అనినఁ 'బవనుండు మనకు లో నైనవాఁడు
తోయజారాతి మనుజులత్రోవ రాఁడు
కాముతూపులు వెంద్రుకఁ గట్టఁబడును
జామ! యేటికి నూరక జలదరింప?' 67

తే. అనుచు నూరడఁ బల్కి తత్ప్రాణసఖులు
దేవకీదేవి కీమాట దెల్ప కున్నఁ
గాదనుచుఁ జేరి చెలియున్న గాథ దెలిపి
రంత యటమున్న తెలిసి మురాంతకుండు. 68

ఉ. తల్లిని దండ్రి నాత్మజులఁ దమ్ముల రమ్మని యేకతంబునం
దల్లకిరీటి యున్న తెఱఁగల్ల సుభద్రకునైన మోహముం
దెల్లముసేసి 'మున్ మనమదిం గల యట్లనె యయ్యె' నంచు రం
జిల్లి 'హలాయుధుం డెఱుఁగఁ జేయఁగరాదు గదా వివాహమున్. 69

క. తనశిష్యుం డని దుర్యో
ధనునకు నీవలచి సమ్మతంపడఁ డటు గా
వున నిందుకుఁ బశుపతిపూ
జన మని యొక టిపుడు గద ప్రశస్తం బయ్యెన్. 70

చ. ఇరువదినాళ్లు రేపు మొద లిందుధరోత్సవలీల లచ్చటన్
జరిగెడు నేఁటి కెన్మిదవనాఁటికిఁ బెండ్లిముహూర్తమవ్వధూ
వరులకుఁ దెల్పిసల్పుఁడు వివాహవిధుల్ హలి కానకుండఁ దీ
వరమున లగ్నవేళ కిటు వత్తు నటంచు నమర్చి దేవకిన్.' 71

## అంతర్ద్వీపమున శివుని జాతర

క. అంతటఁ బశుపతిపూజకు
నంతటఁ జాటంగఁ బనిచి హరి యరిగెఁ బ్రలం
బాంతకు వసుదేవుని ము
న్నంతర్ద్వీపమున కేఁగు మని యావెనుకన్. 72

క. యదువృష్ణిభోజకులజులు
కదలి రపు డనేక బాలికామణి భూషా
మృదుల పరిధాన పరిమళ
విదిత మహైశ్వర్యధుర్య విభవోన్నతులై. 73

ఉ. ఈగతి నంతరీపమున కెల్లజనంబులతోడ నేఁగి యం
దాగమవేద్యశీలికి నతామరపాళికి నిందుమౌళికిం
ద్యాగము భోగముం జెలులయాటలుపాటలు నిత్యకృత్యమై
సాగఁగఁ జూచుచుండి రల శౌరియు సీరియు సంభ్రమంబునన్. 74

## ద్వారకలో శ్రీకృష్ణుని యాధ్వర్యమున సుభద్రార్జునుల వివాహము

తే. అంత నిచ్చట ద్వారకయందు దేవ
కీసతీమణి తాను రుక్మిణియుఁ బెండ్లి
పెద్దలై యర్జును సుభద్రఁ బెండ్లికొడుకుఁ
బెండ్లికూఁతునుఁ జేయ నపేక్షఁ జెలఁగి. 75

ఉ. కట్టిరి మంచిలగ్నమునఁ గంకణముల్ కరపంకజంబులం
బెట్టిరి మేనుల న్నలుఁగు మేలిమృగీమదకుంకుమంబులం
జుట్టిరి కైశికంబుల విశుద్ధమనోహర పుష్పమాలికల్
పట్టిరి పేరఁటాండ్రు ధవళంబులు పాడుచు నుల్లభంబులన్. 76

శా. 'ఇన్నాళ్ళోఁది యొనర్పఁ గేళివనిలో నిం పొందు నమ్మాధవీ
పున్నాగంబుల పెండ్లి సేయవలెఁ బూఁబోండ్లార! రారే' యటం
చు న్నేర్పుల్ దగ నొండొరుం బిలిచికొంచున్ సత్యభామాది వి
ద్యున్నేత్రామణు లప్పు డిర్వురకు విందుల్ సేసి రందందులన్. 77

క. అంతర్వాణి పురోహితుఁ
డంతవివాహోచిత క్రియాకాండం బా
ద్యంతము గావించుట కై
సంతసమునఁ జేరి యున్న సమయమునందున్. 78

క. సంపంగినూనె యంటెన
శంపాంగి కిరీటి కొకతె చనుదోయి పిసా
ళింపం గీల్జడ కటి నటి
యింపన్ గిటగిటని కౌ నొకింత చలింపన్. 79

క. కలశస్తని మణికంకణ
కలశస్తనినాద మొలయఁ గా నొకతె వడిన్
దలఁ బ్రామి పసిఁడికొప్పెర
జలములు చెలు లంది యొసఁగ జలకం బార్చెన్. 80

లయవిభాతి. చలువ లొసఁగెన్ సరగఁ జెలువ యపు డొక్కరితె
వలఁతితన మొప్ప నొకపొలఁతి తడి యొత్తెన్
గొలఁదిగ జవాది నొకవెలఁది తలఁ బూసె నొక
జలరుహదళాక్షి సిగ కలరుసరి చుట్టెన్
దిలక మిడియె న్నిటలఫలకమున నొక్క సతి
తెలి నిలువుటద్ద మొకచెలి నిలిపె ముగ్రోలన్
గలయ జవరా లొకతె మలయజ మలందె నొక
లలన విసరెన్ సురటి యలనరున కర్థిన్. 81

తే. ఒరగవేసిన సిగవింత యొరపుఁ జూచి
బవిరి దిద్దినచెంపలబాగుఁ జూచి
వడి గొలిపి యున్న మీసముబెడఁగుఁ జూచి
యపుడు తమలో సుభద్ర నెయ్యంపుఁజెలులు. 82

క. 'వాసవి త్రిదండివేసము
వేసి గదా మేలు సేసె, వెస జన్నిదమే
వేసికొనవచ్చు నీసిగ
వేసికొనం గూడ దొండువేసము వేయన్. 83

క. దండముఁ గాషాయంబును
గుండికయును మాని పెండ్లికొడు కై నాఁ డా
ఖండలుని ముద్దుఁగొడుకు ప్ర
చండరుచి న్నేఁడు మంచిసన్న్యాసముగా! 84

మ. యతివేషమున నిన్నినాళ్లు మన యుద్యోనాంతరక్షోణి ను
న్నతఁడాయీతఁ? డదేటిమాట? కనుఁగో మం దెన్నఁడేనీతను
ద్యుతి యీ రాజస మీ మొగంబుకళ లీ యొయ్యార మీ వీక్షణా
మృతలీలాభినయంబు లీ సొగసు లీ మీసాలలో నవ్వులున్. 85

క. ఈమహిమ యెందుఁ గలదె
భూమండలిలోన? నితఁడె పో చక్కనివాఁ
డోమగువలార! మును విన
మా మన్మథు నతనిమేనమామన్ మధునిన్. 86

క. ఈ రాజుసేవఁ జేసిన
వారిది గద భాగ్య! మీభువనమోహన శృం
గారునితోఁ గూడం గల
నారీమణిదే సుమీ జనన మూహింపన్. 87

ఆ. మంచిమగఁడు వలయు నంచుఁ గోరుచు నుండ
మంచిమగఁడు గలిగె మఘవసుతుఁడు
మనసుభద్ర సుకృతమహిమ యే మనవచ్చు?
మనసు భద్ర మయ్యె మనకు నెల్ల.' 88

తే. అని నుతింప నలంకృతుఁ డగుచుఁ గొంతి
కూర్మికొడు కుండ బంగారుకుండ యైన
కన్యకారత్నమున కాప్రకారముననె
శిరసు మజ్జన మొనరించి చిగురుఁబోండ్లు. 89

ఉ. భామకుఁ గప్పుదేఱు తెగబారెఁడు నిద్దపుసోగవెండ్రుకల్
వేమఱు దువ్వి భారమున వెన్కకు జాఱఁగఁ గొప్పు వెట్టనో
హో! మఱి వేయు వెట్టినటులొప్పె నదేమనవచ్చు నౌఁగదా!
తామరసాక్షి కెందుఁ దలిదండ్రులు పెట్టనిసొమ్ము పెన్నెఱుల్. 90

క. స్వకపోలకల్పిత మనో
జ్ఞకళాగతి కెట్టు లౌను సరి ఛాయాచో
రకరుచి సందర్భం బని
ముకురము నగుకరణి నవ్వుమోము చెలంగన్. 91

ఉ. అద్దముఁజూచి చంద్రముఖి యందముగాఁ దిలకంబు కస్తూరిన్
దిద్ది యనేక రత్నమయ దివ్య విభూషలు దాల్చి యయ్యెడన్
ముద్దులుగుల్కు కుందనపుముక్కలిపీఁట వసించెఁ దమ్మిపూ
ముద్దియగద్దియం బొలుచుముద్దియ యుద్ది యనన్ శుభోన్నతిన్. 92

చ. 'తనయునిపెండ్లి కేఁగవలె ధాత్రికి దిక్కులవారినెల్లఁ దో
డ్కొని చనుదెమ్ము నీ' వని కడుం గుఱిసేసి సురాధినాథుఁ డ
వ్వనపతి కంపినట్టి శుభవార్తల బంగరుఁగమ్మచుట్ట నా
దినకరమండలం బపరదిగ్గిరికూటముఁజేరె నయ్యెడన్. 93

క. నందకుమారానుజయుఱు
తం దన నందనుఁడు గట్ట దైవతపతి వే
డ్కం దెచ్చుతాళిబొట్టనఁ
జందురుఁ డరుణరుచిఁ బ్రాగ్దిశం గన నయ్యెన్. 94

సీ. కులదేవతను దెచ్చి నిలిపిరి మాణిక్య చకచకల్ గలపెండ్లిచవికెదండ
నైరేనిఁ గొనివచ్చి రైదువుల్ పాటలు పాడుచు శుభవేళ వేడు కలరఁ
బులుకడిగినముత్తెముల బాసికంబులు సరవిఁ గట్టిరి నేర్పు సంఘటిల్లఁ
దలఁబ్రాల కేర్చి ముక్తామణుల్ నించిరి పసిఁడిపళ్లెముల సంభ్రమము మీఱఁ
తే. బణవశంఖ ఢమామికాపటహ కాహళారవంబులు నెఱపిరి బోరు కలఁగ
సకల వినియోగముల జనుల్ సకులె గాఁగ నంతిపురమున నుత్సవం బయ్యె నపుడు. 95

తే. 'తడవు సేసె ముహూర్తంబు దగ్గఱించె
నేమొకో యన్న రాఁ' డని యెదురుచూడఁ
దనదుగారాబుఁ జెలియలి మన సెఱింగి
మాటలోపల వచ్చె నమ్మాధవుండు. 96

క. ఒక రొకరి నెఱుఁగ కుండఁగ
నొకరివెనుక నొకరు వచ్చి రొక నెపమున నా
నకదుందుభి సారణసా
త్యకులును బ్రద్యుమ్నసాంబు లక్రూరాదుల్. 97

## ఇంద్రుఁడు కొడుకు పెండ్లి చూడ స్వర్గము నుండి వచ్చుట

క. హరి వచ్చునంతలో నా
హరియుం జనుదెంచెఁ దనయుఁ డాత్మఁ దలంపన్
సుర లచ్చరలు మహర్షీ
శ్వరులు నరుంధతియు గురుఁడు శచియున్ దానున్. 98

ఉ. చక్కెరవింటిరాజు నెకసెక్కెము లాడఁగఁజాలు నెక్కుడుం
జక్కఁదనంబు గల్గు నెఱసాహసపుంగొమరుండు మ్రొక్కఁ గా
నక్కునఁ జేర్చి మే నిమిరి యౌదల మూర్కొని చొక్కు చుండె లో
నెక్కొనువేడ్క నిక్కుచెవినీలని నెక్కు వజీరుఁడయ్యెడన్. 99

మ. సుముహూర్తం బిదె లెం డటంచు గురుఁ డచ్చోఁ దెల్ప దేవేంద్రుఁడుం
దమదేశంబున నుండి తెచ్చినసువర్ణక్షౌమకోటీర ము
ఖ్య మణీభూషలతోడ బాసికము సింగారించి మందార దా
మము కంఠంబునఁ జేర్చి పెండ్లికొడుకుం బ్రాగ్దంతి నెక్కించినన్! 100

వ. అయ్యవసరంబున. 101

సీ. ఉపరిభాగనిరంతరోన్నమితము లైన ముత్యాలగొడుగులమొత్త మలర
నుభయపార్శ్వముహుర్ముహుశ్చాలితము లైన వింజామరలకలాపుంజ మమరఁ
గళ్యాణవైభవకర్ణేజపము లైన తూర్యనాదములచాతుర్య మొనరఁ
బృథుల ప్రదక్షిణార్చిర్మేదురము లైన దివ్వటీల సమిష్టి నివ్వటిల్ల
తే. నపుడు ప్రద్యుమ్నుఁడు జయంతుఁ డవల నివలఁ బసిఁడి బెత్తంబులను బరాబరులు సేయ
నడచి వచ్చిరి హరిపురందరులు మ్రోల సంభ్రమంబున మందహాసంబు దొలుఁక. 102

చ. అనిమిషభావ మీసమయమందు ఫలించె నటంచుఁ గోరికల్
వెనుకొనఁ బైనిపైని పడి వే తటకాపడి యుర్వశీవిలా
సిని మొదలైన యచ్చరలు చెంతలఁ జేరి సహస్రదృక్తనూ
జుని యొడలెల్లఁ గన్నులుగఁ జూచిరి మానసముల్ కరంగఁగన్. 103

ఉ. దేవకియింట నుండి యి టుదీర్ణతఁ బెండిలికూఁతు రున్నభో
జావనిజానిజా నిజగృహాంగణసీమకు నేఁగి యెంతయున్
ఠీవి ఘటిల్ల సాత్యకి వడిం గయిలా గొసఁగం గిరీటి యై
రావతమున్ డిగెన్ ద్విజపురంధ్రులు ముత్తెపుసేసఁజల్లఁగన్. 104

తే. నరవరోత్తముఁ డటు శుభోత్తరము గాఁగఁ
గుడిపదము మున్నుగా నిడి గడప దాఁటి
యారతు లొసంగ దీవన లావహిల్ల
మోదమున నేఁగెఁ గళ్యానవేదికడకు. 105

## సుభద్రార్జునుల వివాహ వైభవము

శా. శ్రీరంజిల్లఁ బసిండి పెండ్లిచవికం జేరంగ నవ్వేళఁగ
న్యారత్నంబును దోడితెచ్చిరి జనానందంబుగాఁ బాడుచున్
బేరంటాం డ్రురుమంత్ర వర్ణపఠనాప్తిన్ గర్గుఁడున్ దేవతా
పౌరోహిత్యధురంధరుండు శుభమొప్పన్మ్రోలనేతేరఁగన్. 106

క. 'మెత్తుముగదె మన మెపుడుఁ ది
లోత్తమచక్కఁదన మీతలోదరియెదుటన్
మెత్తఁబడె దానిచెలు' వని
యత్తఱి గుసగుసలఁ బోయి రచ్చర లెల్లన్. 107

తే. 'వేయుఁగనులు వలయుఁ బో వీరిఁ జూడ'
నని కవుల్ఁ దంపతులచెల్వు వినుతిసేయఁ

గాదు పదివెలకన్నులు గావలె నని
చూచుచుండె సహస్రవిలోచనుండు. 108

చ. కలరొకొ యెవ్వ రైన నవుఁగా దని యడ్డమువల్కువార లీ
యిల మఱిఁ దా నెఱుంగనటు లెంతటిమాయలకాఁడు కన్యకా
తిలకము దారవోయ వసుదేవునిఁ గట్టడ సేసి వేయిక
న్నులుగల వేలుపుంబలెఁ గనుఁగొనుచుండె మురారి చెంగటన్. 109

క. మధుకరవేణులు కొందఱు
మధురోక్తులు వెలయఁ దెర యమర్చిరి సరగన్
మధుమథనజనకుఁ డంతట
మధుపర్క మొసంగె నృపకుమారాగ్రణికిన్. 110

తే. దేవకి యొసంగఁ గా వసుదేవుఁ డపుడు
చంద్రకాంతపుగిండి గొజ్జంగనీటఁ
బసిఁడిపళ్లెములోఁ బదాబ్జములు గడిగి
తనదు మేనల్లునకుఁ గన్య ధారవోసె. 111

ఉ. సూరెలఁ జేరి యష్టమహిషుల్ దగువారు పొసంగ నావలం
గోరిక నిక్కినిక్కి కనుఁగొంచు సుపర్వు లెసంగ వాద్యముల్
బోరు కలంగ నంగములు పొంగ వధూవరులం గడానిబం
గారపు మెట్టుఁ బ్రాలపుటికల్ గదియించిరి కొంద ఱైదువల్. 112

క. వడిఁ దెఱవల్ తెర వంపం
బడఁతుక నగుమొగము కానఁబడియెన్ గాంతల్
బదఁబడఁగ శరన్మేఘము
బెడఁబాసి చెలంగు చంద్రబింబమువోలెన్. 113

క. అమృత మొలుకు నధరంబునఁ
గుముదచకోరముల నేలుకొనుశుభదృష్టిన్
గమలములకళలు గైకొను
రమణీమణి ముఖముఁ దెఱచి రా జన వలెనా? 114

చ. పొలయలుకందు వేఁడుకొను పొందికఁ దెల్పెడులీల సిగ్గుదొ
ట్రిలిన ముఖాబ్జ మెత్తి మెడ క్రిందికి హస్తయుగంబుసాఁచి వే
నలిఁ దెమలించి సౌఖ్యకలనస్థితి గట్టిగఁ బట్టి కట్టె న
వ్వెలఁదుక కంఠసీమఁ గురువీరుఁడు మంగళసూత్రమయ్యెడన్. 115

చ. తమతమవార లొండొరులదండఁ గరంబుల ముత్తియంపుఁబ
ళ్లెము లిడి చేయిమించఁగవలెం జుమి నీ కని యెచ్చరింపఁగా

నమితముగా సుభద్రయు నర్జునుఁ డర్జునుపై సుభద్రయుం
దమిఁదలఁబ్రాలు వోసి రెలనవ్వును సిగ్గును లోఁదొలంకఁగన్. 116

తే. అగ్ని సాక్షిగఁ బెండ్లాడినట్టి ప్రియవ
ధూటియును దాను బంగారుపీఁటమీఁద
నుచితగతి వెలయంగఁ గూర్చుండి పాక
శాసని చెలంగె దీవించి సేస లిడఁగ. 117

తే. మృగమదము చెంతఁ గుంకుమరేఖవోలె
నీలమణిపొంత నుదిరిపొన్రేకువోలె
మేఘముకుఱంగటను దీగ మెఱపువోలె
నర్జునునిచెంగట సుభద్ర యలరె నపుడు. 118

చ. కలుగుఁ గలావిషేషము జగంబునఁ బెండ్లి యటన్న నెట్టివా
రల కటువంటిపట్ల నెలప్రాయము రూప మొయార మూని పే
ర్కలిగిన రాచకూఁతు రఁట రాకొమరుం డఁట యేమి చోద్య మా
సొలపుమిటారిసిగ్గరులు చూపఱచూడ్కికి విందు సేయుటల్? 119

క. అంతటఁ బౌలోమీమఘ
వంతులకుం బెండ్లికొడుకు వందన మిడఁ ద
ద్ప్రాంతమునఁ బెండ్లికూఁతురు
గొంతటు తల వంచి మ్రొక్కఁ గొంకుచు నున్నన్. 120

శా. ఎంచం గాఁ దగు నత్తమామలను దా నిల్వేల్పులం గా మనః
ప్రాంచద్భక్తిని సాధ్వి యందు రది మీపట్లన్నిజం బయ్యె నేఁ
డంచుం జేరి శచీపురందరుల కాహ్లాదంబుగాఁ బల్కి మ్రొ
క్కించెన్ దేవకి యప్పు డర్ధహిమరుగ్బింబాలికన్ బాలికన్. 121

మ. ప్రణయం బొప్పఁగఁ గృష్ణునిం గని సుపర్వస్వామి 'యీ సర్వల
క్షణముల్ గల్గినకన్య మంచివరునిం గాఁ జూచి యీ నేర్చు నై
పుణి మీకే తగు'నంచుఁ బల్కఁ 'బరమాప్తుల్ మీరు రాఁగా విజృం
భణవృత్తిన్ నెఱవేఱెఁ బెండ్లి' యని పద్మాక్షుఁడుం బల్కఁగన్. 122

## వియ్యాల వారి మర్యాదలు – సయ్యాటలు

సీ. వియ్యంపుమర్యాద వెలయఁ దానును శచీ జాని బువ్వాన భోజనము సేసి
గుమగుమవాసించు కుంకుమ కస్తూరి యమరవల్లభుని హస్తమున కిచ్చి
గంబూర గుల్కినతాంబూల మింద్రుఁ డం దుకొని తా సేనాని దోయిట నిడి
పీతాంబరముల విప్పి యనేకములు వజ్రి చేతిసంజ్ఞ జయంతుచేతి కొసఁగి

తె. కెలఁ గె ల్వట్టి కొన్ని వాకిండ్లు గడచి రాఁగ విచ్చేసి యుండుఁడు రా వల దని
బలిమి బలభేది యెదురుగ నిలిచి మ్రొక్క వేడుక మురారి కేల్మోడ్చి వీడుకొలిపె. 123

క. అంతకు మునుపే హరి య
త్యంతకుతూహలముతోడఁ దగుమేరల న
య్యంతఃపురి భోజసుతా
కాంతను బౌలోమి ననుపఁ గట్టడ సేసెన్. 124

తే. రుక్మిణీదేవి తమయత్తమ్రోల శచికిఁ
బసిఁడిగిన్నియఁ గస్తూరి యొసఁగ నామె
చేఁ దిగిచి దేవకీదేవిమీఁదఁ జిలికి
వదినెగా రని యొకకొంత వావి నెఱపె. 125

ఉ. 'వీయపురల వైతి గదవే యిపు డత్తవు తొంటివావి నో
తోయజనేత్రుఁ గాంచిన వధూమణి! నీసుతఁ బెండ్లియాడఁగా
నాయము నాకుమారునకు నర్మిలి హత్తఁగ నత్త వావిచే
నాయువు గల్గువాఁడవు నటంద్రు శుభంబగు దీననెంతయున్.' 126

తే. అని సరసలీల నుడుగర లంది యపుడు
పారిజాతంబుకతన మున్ బరిచయంబు
చాలఁ గల్గుటఁ బ్రియముతో సత్యభామ
తనకు మ్రొక్కిన నింద్రాణి నెనరుతోడ. 127

ఉ. 'చెల్లెల! లెస్సలా పెరటిచెట్టుగ నాటిన పారిజాత ము
త్ఫుల్లనవీనసూనములతో విలసిల్లుచు నున్నదా? సదా
యుల్లముదానిమీఁదటనె యుండును నాకది ప్రాపుఁ బ్రోపుఁబు
ట్టిల్లును జొచ్చి నిల్లునయి వృద్ధినొసంగెడు నీకు నెంతయున్.' 128

క. అని యుచితోక్తుల వారల
మనముల రంజిల్లఁ జేసి మన్ననతో న
య్యనిమిషలోకాధీశ్వరు
ననుఁగుంబట్టంపుదేవి యరిగిన యంతన్. 129

## సుభద్రార్జునుల యింద్రప్రస్థపురీ ప్రయాణము

తే. 'ఏల యాలస్య మిఁక నిందుఁ బ్రోలు సొచ్చి
నాగవలి సేయుదురుగాక వేగ కదలి
పొండు దంపతు' లని ధనుష్కాండరథహ
యంబుల నొసంగి నరుఁ బయనంబుసేసి. 130

ఉ. చంద్రకిపింఛలాంఛనుఁడు చంద్రిక లీనెడు నవ్వు మోముతో
నింద్రజురాక ధర్మజున కేర్పడఁగా శుభలేఖ వ్రాసి వే
చంద్రిక పెట్టి యందుపయిఁ జెంద్రికవన్నియసాలు సుట్టి ని
స్తంద్రతఁ దానెముద్రయిడి చారులచేఁబనిచెన్ రయంబునన్. 131

క. ఈరీతి నన్ని యమరిచి
యారాతిరె యేఁగి శౌరి యడఁకువ నుండెన్
సీరికడ దేవకియుఁ దన
గారాబుఁగుమారి నంపఁగా రమ్మనుఁడున్. 132

తే. అత్తవారింట సకలభాగ్యంబు లున్న
మగనిమీఁదటఁ దన కెంత మక్కువున్న
నాఁడుఁబుట్టువు పుట్టింటి కాసపడును
గావున సుభద్ర యొకతీరుగాఁగ నుండె. 133

తే. తల్లిదండ్రులు గారానఁ దన్నుఁ బెనుప
వదినె లన్నలుఁ గడుగారవంబు నెఱప
నల్లయూరంత బలఁగంబునందు నుండి
యొకతె యెడఁబాసి పోవ నెట్లోర్చు మనసు. 134

క. అట్టుల తొంగలిఱెప్పలఁ
దొట్టెడు బాష్పములతోడఁ దొట్రిలుముద్దుం
బట్టిఁ గని కడుపు చుమ్మలు
చుట్టఁగ నది మట్టుపఱిచి శుభ మొనరంగన్. 135

తే. 'ఏంతఁటే యేమి? మేనత్త గొంతిదేవి
కోరి వెండియుఁ బెండ్లాడినారు మీర
లొండొరులు నీవిభుండు లోకోత్తరుండు
దొరకెను సుభద్ర! మంచికాఁపురము నీకు. 136

క. ఈలోనఁ జూడవచ్చెద
మేలే చింతిల్లె?' దనుచు నెంతయు బ్రేమన్
గేలం గ్రొమ్ముడి దువ్వుచు
బాలన్ దీవించి తల్లి పనుపన్ వేడ్కన్. 137

మ. సకియ ల్గొందఱు వెంత వచ్చి మణిభూషల్ చక్కఁగాఁ దీర్చి చెం
ద్రికపూవన్నియజిల్గుఁజేల కటినెంతే గట్టిగాఁ జుట్టి పెం
డ్లి కుమారుండు కరాగ్రమూఁత యొసఁగన్ వ్రీడావతిం దేరి మీఁ
దికి నెక్కించిరి మందహాసకలనా దేదీప్యమానాస్యలై. 138

తె. అటులఁ దేరెక్కి దంపతు లరుగఁ జూచి
జనులు 'రతిమన్మథులు వీర' లని తలఁచిరి
హరితురంగము లించువి ల్లలరుఁదూపు
లంద యుండంగ సందియ మంద నేల? 139

## యాదవసేన సుభద్రార్జునుల నడ్డగించుట

ఉ. పచ్చని పచ్చడంబు దొర పంపిన త్రోవనె పోవునంతలో
నచ్చటఁ దెల్లవాఱ 'నితఁ డర్జునుఁ, డీమె సుభద్ర వీరిఁ బో
నిచ్చిన మాట వచ్చు బలకృష్ణులచేతఁ' నటంచుఁ దారు తా
రెచ్చటికై పృథుశ్రవసుఁ డేలిక గాఁ గలప్రోలికాపరుల్. 140

క. అల బలము లసంఖ్యము లై
యలబలములు చేయుచుండ నప్పుడు కలఁకం
గలకంఠీమణి రిపుమద
కలకంఠీరవుని ధవునిఁ గని విస్మిత యై. 141

పంచ చామరము. 'హుటాహుటిన్ హలాయుధుండహో! మహోగ్రుండై తనం
తటం దటాన నిప్పు డీవిధం బెఱింగి వచ్చెనో?
ఘటాఘటీల నెల్లఁ ద్రోవఁ గట్టి పట్టఁ బంచెనో
యటో యిటో యెటో భటోద్భటార్భటుల్ ఘటిల్లెడున్. 142

తే. తేరుగడఁప మాయన్న దిద్దె నన్ను
నేయ నేరిపె వింట నొక్కింత నాకు
నావదినె సత్యభామ ము న్నరక యైన
నిలిచి ము న్నరకాసురు గెలిచెఁ గాదె?' 143

క. అని రాజకన్య గావున
మనమునఁ గలధీరతయును మమతయుఁ దెలుపన్
విని యఁట దరహాసంబున
నునుఁజెక్కిలి చికిలిగోట నొక్కుచు వేడ్కన్. 144

క. 'న న్నెవ్వనిఁగా జూచితి?
కన్నియ! నీచేయునంత కార్యం బిట నే
మున్నది? చూడుము చెండెద
ఛిన్నాభిన్నములు కాఁగ సేనల నైనన్. 145

## సుభద్రా సారథ్యము – అర్జునుని యాహవ వీరము

క. నివెడు కెల కాదనఁ
గావలె? నటువలెనె తేరు గడపు' మటంచున్
జే విలునమ్ములు గైకొని
నా విజయుఁడు సమరసన్నహనదోహలుఁడై. 146

ఉ. అంతటిలోఁ బ్రభుశ్రవసుఁ డాదిగఁ గల్గినవీరయోధు ల
త్యంతకఠోర తోమర శరాసనబాణ కృపాణపాణులై
పంతము లాడుచుం బదరి పైఁ బడఁ జూచుబలంబు లెల్లఁదా
మంతట నంతట న్నిలిపి యడ్డముగం జని యాధనంజయున్. 147

ఉ. 'స్యందనమున్ దురంగములు శౌరివె పో బలరాముచెల్లె లీ
ఇందునిభాస్య యీమె నెట కెత్తుకపోయెదు రాకుమార? యే
మందురు యాదవుల్ వినిన? హో యిటువంటివె రాచవారితోఁ
బొందులు? కానకుండఁ గొనిపోఁ దగవా మిమువంటివారికిన్?' 148

క. అనుటయు 'నేమీ కనినం
గనకుండిన? నానఁ బూనఁగలరా మీరల్?
మనవలసిన నీమాటలఁ
బనిలేదు చనుం' డటంచు బైఁ బడి రాఁగన్. 149

ఆ. రాకురాకు మనెడి రట్టడితనములు
పోకుపోకు మనెడి పొగరువగలు
పొడువు పొడువు మనెడి బెడిదంపుబీరముల్
విడువు విడువు మనెడి వీఁక లెసఁగ. 150

ఉ. ముందరవెన్క నీకరణి ముంచుకొనం జలియింప కిం పొన
ర్పం దరళాక్షి తేరుగడపన్ గడకంటనె పాఱఁ జూచి విం
టం దొడి యేయుటల్ బయలొనర్పక యెంతటినేరుపార! పౌ
రందరి యందటిన్ శరపరంపర వెంపరలాడె నయ్యెడన్. 151

సీ. కొండలవలెనున్న కొమ్ముఁగత్తులభద్ర దంతావళముల మొత్తములు బలసి
యంబుధితెరలచందంబునఁ దుటుములై భాసిల్లు కంఖాణబలము లొదవి
విరివియై మేఘముల్ పెరిఁగి వచ్చినజోక ఘనపతాకల శతాంగములు హత్తి
వెదురుపొదల్ పేర్చువిధమునఁ గనిపించు గడలపౌఁజులు సమగ్రముగఁ గూడి
తే. యుక్కుపొడిరాల రోషంబు పిక్కటిల్ల నొకరొకరిఁ గేవవెట్టు నత్యుగ్రసింహ
రవములు చెలంగ సైనిక ప్రభులు తారసిలి రుదారశిలీముఖార్చులు నటింప. 152

ఉ. ఎత్తిన యాయుధంబు లవి యెన్నియొ యన్నిటినన్నితూపులన్
దుత్తునియల్గఁ జేయు మరి తోడనె పూనఁగఁ జేతులాడ నీఁ

డత్తరుణరథాశ్వములయండకు రావిడc డంప తున్క యె
నత్తరి నాతc డేమనcగ నా శరలాఘవసావధానతల్? 153

మ. రకపుంజెయ్యిలc దా వినోదముగ సారథ్యంబుc గావించు క
న్యకపైc బెట్టిన చూపె కాని యిటు సేనన్ జూచుటే లేదు సా
యకపంక్తుల్ నడుచున్ సహస్రములు గా 'నయ్యారె! విప్వచ్చు చే
తికిc గన్నుల్ గల!' వంచు నెంచి రపు డెంతే వీరయోధాగ్రణుల్. 154

ఉ. 'శూరకులంబు సర్వ మొకజో కయి వచ్చి యెదిర్చె నేని నే
నీశిరోమణి గ్రహింపక పో' నని గట్టిగా నహం
కారము మీఱc గంకణము గట్టుక యుండెడు నిప్పు డర్జునుం
'డౌర రణంబు పెండ్లికొడు' కంచు నుతించిరి వీరపుంగవుల్. 155

ఉ. అమ్మెయి వాజివారణభటావళిc గప్పిన తూపు లే మనన్?
దిమ్మలుగాc దటాకముల నిండుశరమ్ములc బుష్పవాటులం
గ్రమ్ము శిలీముఖంబుల ధగద్ధగితోన్నత సౌధగోపురా
గ్రమ్ములయందు వ్రాలెడుఖగమ్ముల నెన్నిన నెన్న శక్యమే? 156

క. అలుcగులపోకడలును మై
యలయికలను మీcదుమిక్కి లై కడు లోనై
బలములు తమతమబాహా
బలములు నcటc బనికి రాక భయవిహ్వలులై. 157

## విజయుని విజయము

ఆ. ఒక్క మొగము గాక యుఱికిరి సైనికుల్
దిక్క మొగము లగుచుc జిక్కు భటులు
మ్రొక్కి రీటియలు తటుక్కునc బడవైచి
యక్కిరీటి యెదుట నాcగc గలరె? 158

వ. ఇత్తెఱంగున జయాంగనాసంగమంబునం బొసంగియుc జెక్కు చెమర్చక యక్కురువీరుండు సారథ్యనిపుణత్వంబునకు మెచ్చి యచ్చిగురుcబోcడి నవారితప్రేమాతిశయంబునం గౌcగిలించి 'యొక్కించుక రేక మోవని నా యురః స్థలంబున నీకుచకుంకుమ రేఖ లంటించి మీవారికి సూడు దీర్చితి' వని నవ్వుచు, నవ్వలం గొంత దవ్వరుగుచు నట ప్రచ్ఛన్న వేషంబునc దన రాక కెదురుచూచుచున్న విశారద ప్రముఖాప్త పరివారంబుల గారవించి. మురారిప్రేరిత దాశార్హనివేదితార్హ మార్గంబున మహారణ్యంబులును గిరివరేణ్యంబులును నదీనదంబులను జనపదంబులుం గడచి, స్వదేశంబుc గాంచి, యుల్లాసంబున నందంద విశ్రమించుచుc జనం జనం, జారుల వలనం దెలిసి యగ్రజానుశాసనంబున నానాసేనాసమన్వితులై మాద్రీసుతు

లెదుర్కొని యుపాయనానతులు సమర్పింప నుపగూహన బహూకృతు లొనర్చి, దశదిశాదుస్సహనిస్సాణ ప్రముఖనిస్వనంబులు బోరుకలంగ నలంకృతనిస్తుల స్తంబేరమారూఢుండై గగనోల్లేఖి తోరణధ్వజోల్లోచప్రాంచత్పిచయ ప్రచయ ప్రచలత్ప్రచలాకిచిత్రచ్ఛవివ్యాప్త హేమచ్ఛవి ఫలగుళుచ్ఛ విరాజద్రాజరంభాస్తంభ విజృంభిత ప్రతిమందిరంబును, విలోకిత బిబ్బోకవతీ వ్యాకోచలోచన ప్రాచుర్య విభ్రాజమానతనూజోత్సవ దిదృక్షా గృహీతానేక విగ్రహ సహస్రాంబక విడంబిభర్మ హర్మ్యనికురంబంబును, నీరాజనలాజాక్షత కుసుమ కిసలయ వ్యాకీర్ణ కలశ గ్రహయాళుమహీ లేఖ మహిళా భూయిష్ఠ ద్రాఘిష్ఠవేది కాంతరంబుననగు నింద్రప్రస్థపురంబును సకల జన రంజన కుశల విశాల కటాక్ష కృపా రసావేశంబునఁ బ్రవేశించి మున్ను సుభద్ర ముహూర్తంబున సుభద్రా భద్రేభయానం జతురంతయానంబున శుద్ధాంతంబున కనిపి ధౌమ్యాదుల కభివందనంబుఁ గావించి యాశీర్వాదంబులు గైకొని, నిజాగమన సంతోష రసోన్మేష భూషిత సుప్రసన్నాననబిస ప్రసూనుండును రత్న సింహాసనాసీనుండును నగు ధర్మసూనునకు సాష్టాంగం బెరఁగి, భీమసేనునకు నమస్కరించి, యంతఃపురికిం జని కుంతీదేవికి వందనం బాచరించి, ద్రుపదనందన నుపచరించి, యిష్టాలాపంబుల సుఖంబుండె. 159

## సుభద్రాపహరణ వృత్తాంతము తెలిసి బలరాముఁ డాగ్ర హోదగ్రుఁ డగుట

ఉ. అంతట ద్వారకాపురమునందు సభాపరిపాలుఁ డర్జునో
దంతము యాదవుల్ దెలియునట్లు హజారమునందు భేరి య
త్యంతరుషాకషాయిత హృదంతరుఁడై చఱపించె మించె ది
గ్దంతిఘటాశ్రవఃపుటభిదాచణ భీషణ భూరిభాంకృతుల్. 160

క. ఆనాదము విని హలి మొద
లైన యదూద్వహులు పురికి నరిదెంచి సభా
సూను లయి నరునికపటవి
ధానము మఱి మఱియు నడిగి తప్తాశయు లై. 161

తే. "యతి ననుచు వేషభాషల నటమటించి
పొంచి తఱి వేచి కన్నియఁ గొంచు నరిగె
'దొరఁకు సన్యాసి' యనుమాట తిరము గాఁగ
నర్జునుం డద్దిరా యెంతదుర్జనుండు! 162

శా. ఏతన్మాత్రమె కార్యభార మని పైయెత్తెన్నకే నేఁడు ని
ర్భీతిన్ బాలికఁ గొంచుఁ బోవ నుచితంబే కండగర్వంబు? దు
ర్నీతుల్ యాదవవీరసింహములతోనేనా? బలారా! బలా
రాతి ప్రోద్భవుఁడెంత సేసె! నిది తీరా వీరరాణ్మౌళికిన్? 163

ఉ. వంచన చెసి యిట్లు చెలువం గొనిపోవఁ బ్రలంబవైరి సై
రించునె? దుర్మదాధిపవరేణ్యులభూములు దున్ని ధూళి గా
వించఁడె? పిండిపిండిగఁ బ్రవీరవిరోధికిరీటరత్నము
ల్దంచఁడె? ఘోరసీరముసలంబుల వ్యర్థములే ధరించుటల్?" 164

క. అని కాళిందీభేదనుఁ
డనువాక్య మొకింత విన్న యంతనె మేఘ
ధ్వని గెరలెడు మదకేసరు
లన యోధాగ్రేసరులు మహామత్సరులై. 165

ఉ. 'యాదవవార్ధి వెల్లివిరియన్ మఱి యాఁగెడుపాటివీరుఁ డి
మ్మేదిని నెవ్వఁ డిందులకు మీరలు గావలె? నేమె చాలమే?
పోదుమె? కట్టి తెత్తుమె? ఋభుప్రభునందనుఁ డెంత? వానితం
డ్రే దురమం దెదిర్చినను రేకు మడంతుము మాటలేటికిన్?' 166

తె. అని యుదగ్ర మహోగ్రహావ్యగ్రుఁ డైన
యన్నమాటలు సభవార లన్నమాట
లేమి చవిగామియును దాల్మి యోమి భక్త
జనకుశలకామి యల యదుస్వామి కనియె. 167

## శ్రీకృష్ణుఁడు బలరాముని శాంతపఱచుట

క. 'యదురాజకుల శిరోమణి!
యెదురా మీ కొకరుఁ? డుచిత మెఱిఁగియుఁ బరు లెం
చ దురాప కోప మూనుట
చదురా? తెగరానిచోట సైరణ తగదే! 168

క. ద్రోణాచార్యుల శిష్యుఁడు
బాణాసననిపుణుఁ డరినృపాలకమకుటీ
శాణాగ్ర తేజితోగ్ర కృ
పాణాంచద్భుజుఁ డతండు ప్రభుమాత్రుండే! 169

ఉ. ఆపురమర్దనుండయిన నాతని నడ్డము దాఁకి నిల్వఁగా
నోపఁడు మత్స్యయంత్రము మహోద్ధతి నేసి స్వయంవరంబునన్
ద్రౌపదిఁ గైకొనం జెనకు రాజకుమారులపా టెఱుంగమే
మూఁపులు మూఁడగున్ రిపుచమూపులఁ గన్నపు డేకిరీటికిన్. 170

ఉ. మాలిమి లేదు గాన ననుమానము నామదిఁ దోఁచె నప్పుడే
బాలిక సేవ సేయఁ బనుపన్ వలదంటిని గాదె? దాని కే

మిలువు కల్గు మెనమఱఁ దింతియె యాతఁడు నైన దైనదె!
లోలత నింక నాగవలిలోపల నిష్ఠుర మేల పల్కఁగన్? 171

ఉ. క్రీడి సమాను లెంచఁ గలరే యిల ఱేఁడులలోన? దూలఁబో
నాడఁడు వైరినైన విడనాడఁడు నెయ్యము కోపగించియుం
జూడఁ గలట్టివాఁడు సరసుండు సుభద్రకు హర్షవార్ధినో
లాడఁగ నంతకంటె నను వైన వరుం డిఁక నెవ్వఁడివ్వలన్. 172

ఉ. నమ్మినవారు పాండునృపనందను లందఱిలోనఁ బెద్దగా
మిమ్మె గణించు ధర్మజుఁడు మీ రటకున్ విజయంబు సేయ వే
గ మ్మెదురేఁగుదెంచి కడుఁ గన్నులఁ గప్పుకొనుం బదుం డనం
దమ్మునిమాట యన్న జవదాఁటనియన్న ససంభ్రమంబుగన్. 173

మ. గజకంఖాణశతాంగపత్తిబలవర్గంబుల్ సమగ్రంబు లై
భజియింపం బితృపుత్రపౌత్ర సుహృదాప్తశ్రేణిఁ గూడం బ్రియా
నుజుఁడుం దాను సమస్త వస్తు ధన సందోహంబుతో వచ్చె స
ర్వ జనానందకరంబు గాఁగ నటు లింద్రప్రస్థమున్ జేరఁగాన్. 174

## ధర్మరాజు బలరామాదుల సగౌరవముగ నెదుర్కొనుట

ఉ. అంతకు మున్నె కృష్ణుఁడు హలాయుధుఁ దోడ్కొని వచ్చుచున్న వృ
త్తాంత మెఱింగి తీవి మెఱయన్ నగరిం గయి సేయఁ బంచి య
త్యంతవినీతి ధర్మజుఁడు తమ్ములుఁ దానెదురేఁగి రేవతీ
కాంతునకుం బ్రణామములుఁ గాన్కలు సేసి యథా క్రమంబునన్. 175

మ. చెలువం దెచ్చుచునుండి యీసున శునాసీరాత్మజుం డమ్మహా
బలముం జేరఁగ బోరు మేదుర దురాప క్రోధముం బాసి లో
నలరం గౌఁగిటఁ జేర్చె శంభుజభుజాహంకారరేఖానిర
ర్గళమార్గ ప్రబహుంబ్రలంబహుబహూకారంబుగాఁ బల్కుచున్. 176

ఉ. బావ యటంచు వావి నడపన్ భయభక్తుల మ్రొక్క వచ్చున
ద్దేవకిపట్టి ధర్మజుఁ డతిత్వరితమ్ముగఁ గ్రుచ్చి యెత్తి త
ద్భావమెదం గుదుర్పడఁగఁ దార్చిన భంగిఁ గవుంగిలించి, 'మా
కీవ గదయ్య సర్వశుభహేతువు నిచ్చలు' నంచు నెంచుచున్. 177

తే. కెడల బలరామకృష్ణులు నడుమఁ దాను
భద్రదంతావళము నెక్కి పాండవేయ
ముఖ్యుఁ డతిరాజసంబున ముప్వేలుంగు
పోలికఁ బొసంగ వచ్చెను బ్రోలి కపుడు. 178

ఉ. అంతిపురంబులో నరిగి యందఱు వందన మాచరింప నా
కుంతికి మ్రొక్కి భక్తిఁ దమకుం బ్రణమిల్లిన ద్రౌపదీసతిన్
స్వాంతము రంజిలం బలికి శ్యామహరిత్పరిధాను లొప్పి రం
తంతకు నిష్టబాంధవసమాగమసౌఖ్యమునం జెలంగుచున్. 179

క. దొర పెట్టినహరు వెట్టిదొ
యరు దాహా! విడుదు లున్న హవణిక లులుపా
పరిఢవము నింద్రభోగమె
దొరకెను దమ కననివారు తుది లే రొకరున్. 180

క. వీయమువారికి నిట్లు ద
వీయముగా నుండి వచ్చు విపుల శ్రమముల్
దీయ ముదం బొనరిచి కడుఁ
దీయము కనిపింపఁగా యుధిష్ఠిరుఁ డనియెన్. 181

క. 'చనవున బలిమిం గన్నియఁ
గొని వచ్చి వివాహ మౌటకు స్వతంత్రులఁ గా
నొనరించినార మము ని
ట్లనుకూలత గల్గు బంధు లవనిం గలరే. 182

తే. ఆదినారాయణుం డీ మురాసురారి
యురగకులభూషణుండ వీ వరసిచూడ
నిట్టి మీ బాంధవము గల నెట్టితపము
చేసినార మొకో మేము సీరపాణి!' 183

## బలరాముఁడు సుభద్రార్జునుల వివాహము నతివైభవముగ జరిపించుట

చ. అని ప్రియభాషణంబుల మనోఽబ్జము రంజిలఁ జేయ సంభ్రమం
బున హలి 'సర్వసన్నహనముం దగ ని ట్లెదు రేఁగి పెండ్లి చే
సిన దొర యెందు లేఁ'డనఁగఁ జెల్లెలి ముద్దుమఱందిఁ గోరికల్
పెనఁగొనఁ బెండ్లికూఁతుఁగనుఁ బెండ్లికుమారుఁగఁ జేసి వేడుకన్. 184

సీ. సకల వాద్యములు బోరు కలంగ నెడమీక నలుఁగులు నులుపాలు నడచుచుండ
నిఖిలబాంధవరాజనికరంబు మేలైన యుడుగరల్ గొని వచ్చి పొడగనంగ
నాశ్రిత విద్వత్కవిశ్రేణులు యథేష్ట సంభావనలఁ జాల సంభ్రమింప
విందులఁ గర్పూరవీటికాంబర వసంతముల నెల్ల జనంబు తనివి నొందఁ
తే. బ్రియము వినయంబు తాల్మి యోపికయుఁ గల్గి యచ్యుతాగ్రజభీమసేనాగ్రజన్ము
లెంతటిమహాత్ము లని జగం బెంచఁ జేసి రుచితగతి నొప్ప వైవాహికోత్సవంబు. 185

ఉ. అంతట నైదునాళ్లును మహామహిమం దగి దంపతుల్ గృహా
భ్యంతర దేవతార్యనతులై తన కర్మిలి మ్రొక్క రుక్మిణీ
కాంతుఁడు వల్కె లేనగవు గ్రమ్మఁగ 'మీరిటు లెల్ల కాలమున్
మింతురుగాక శోభనముమీఁదనె శోభనమై ముదంబునన్.' 186

క. అని దీవించిన లోలో
ననె ముసిముసినవ్వు లొలయ నమ్రాననులై
తనరిరి వా రామాటకు
పునరభివాదనము చేయుపోల్కి జనింపన్. 187

చ. తొలఁకెడు ప్రేమ బందుగులతో మణిపాత్రికలందు నప్పు డు
జ్జ్వలదమృతాన్నముల్ కొలముసామికి నప్పనగాఁగఁబండువె
న్నెలబయలన్ భుజించి నెఱినీ టెసఁగన్ సగపాలు గంబురా
గులికిన కమ్మవీడె మొకకోమలి యీఁ గొని క్రీడివేడుకన్. 188

## పడుకటింటి చక్కఁదనము

ఉ. చందురుజాతిబాగడపుజంటబవంతి వెడందయంకణం
పుందగులూని పార్శ్వమునఁ బొల్పగు పల్వగ కెంపుటంచు డా
కుం దెలిగుండుకంబముల గ్రొంజిగిబోదెల నందగించి పై
సందులఁ బంచవర్ణమణిజాలకముల్ రహిఁ జూప లోపలన్. 189

ఉ. బంగరుమేలికంబములఁ బాటిలువాటపుమధ్యరంగమున్
జెంగట జీవరత్నములచెక్కడపుంబని మించు సెజ్జయిల్
ముంగల వజ్రపుంబలుకలోనఁ బొసంగిన నొప్పు చప్పర
మ్ముంగల భావచిత్రనవమోహనకేళిగృహాంతరంబునన్. 190

చ. కెలఁకుల వజ్రముల్ నడుమఁ గెంపులు మూలల ముత్తెముల్ పర
స్థలములఁ బచ్చలుం సుళువుజాతితగంబని హర్వు నందమున్
వెలయఁగఁ దేరి చూడఁ గడు వింతయుఁగోటికిఁ గోటియైనను
న్విలువ యొనర్పరానియొక నిద్దపుమంచముపై వసింపఁగన్. 191

ఉ. గోవజవాది కస్తూరియుఁ గుంకుమ గందము పైఁడి గిన్నెలన్
దావి బుగుల్ కొనం గెలనఁ దార్చిరి పంజరకీరశారికల్
'దేవ! పరాకు సామి?' యని తెల్పఁగ రత్నపుఁగీలుబొమ్మలే
కావలెఁ గొందఱందు నుడిగంపుటొయారపు ముద్దుజవ్వనుల్. 192

క. అందలిక్రొందలిరుంబోం
డ్లందలి కందళితశుకముఖాలాపరసం

బందలి నుందలిమంబులు
నందలిబొందళపుఁ దెరలు నవలం గలవే? 193

ఉ. చక్కఁదనంబు లెల్ల నొక చక్కినె దొంతరగాఁగ నిల్చెనో
యెక్కడఁ జూడఁ జూడ్కికదియే విడిపట్టగుఁ జూడఁ జూడఁగా
మిక్కిలి వింతయై మెఱయు మెచ్చులకున్నెల వీదొకింతయు
మ్మక్క! గణింపఁగాఁదరమె యా పడకింటి విలాస సంపదల్? 194

తే. ఉండె నరపతి యందు మే నుబ్బుచుండ
నఖిలసామ్రాజ్య మేలినయంత వేడ్క
రమ్యమగునిల్లు మేలైన రాజముఖియుఁ
గల్గెనఁట! యంతకన్న భాగ్యంబుఁ గలదె! 195

క. అంతటఁ బ్రౌఢసఖీతతి
కాంతామణిఁ గాంతుకడకుఁ గదియించుట కై
వింతగ మోమునఁ జిఱునగ
వింత కనంబడఁగ ముదితహృదయాంబుజలై! 196

సీ. 'జడకుచ్చుఁ గైకొమ్ము ముడువు చేడియ విరుల్ వేనలి వట్టిన వీడకుండఁ
జేర్చుక్క సతి యింద తీర్చుము తిలకంబు కస్తూరి చెమటచేఁ గరఁగకుండఁ
గొనుజంటరవికఁ గుంకుమగంద మలఁదుమో చెలి! యెంత యొరసినఁ జిటులకుండ
మొలనూ లిదిగో బోటి! చలువ పొందుగఁ గట్టు సయ్యాటలనె నీవి సడలకుండ
తే. తరుణి కివియిచ్చు గద మెచ్చు తప్ప!' దనుచు నేరుపరు లైనవారిగా నేఱుపఱుపఁ
గాంతనవసంగమార్హ శృంగారవిభవ లీల నలరించిరా జవరాలి నపుడు. 197

క. "తడ వేటికి లే జవ్వని!
విడె మీవలెఁ బతికి నుంచివేళ సుమీ యి
ప్పుడు రాకన్నియ వల్లభు
కడఁ బెనఁగుదు గాక పెనఁగఁ గా నిటఁ దగునే! 198

## నెచ్చెలులు సుభద్రకు హితము బోధించుట

సీ. ప్రియముతో రమ్మని పిలిచినఁ జేరఁ బోయెదవు గా కూరకుండెదవు సుమ్ము
చెంతఁ గూర్చుండంగఁజేఁ జూపఁ గూరుచుండెదవు గా కూరకుండెదవు సుమ్ము
విడెము చేతి కొసంగ వినయంబుతోడ నందెదవు గా కూరకుండెదవు సుమ్ము
మధురోక్తి వినఁ గోరి మాటాడ మాఱువల్కెదవు గా కూరకుండెదవు సుమ్ము
తే. కాక విభుఁ డైనఁ గొంత సిగ్గరితనంబు కడలుకొని యున్నఁ గ్రక్కునఁ గడకు రాక
చక్కఁగ నొకింతసే పటు సమ్ముఖమున నిలువుమీ రత్న పాంచాలిచెలువు మీఱి. 199

క. అనవలసి యంటి మింతె!
నినుఁ జూచిన నింద్ర తనయునికి నింద్రతనూ
జునిఁ జూచిన నీకును మఱి
మన సూరక యున్నె పూర్ణిమాచంద్రముఖీ! 200

సీ. చిలుక నీచేఁ గాక చెలిచేత నుండదే నిమిరి యిప్పుడే మాట నేర్పవలెనె?
యెదుటఁ గౌసెన వేయ కిడినారు తెమ్మని వీణ యిప్పుడె మేళవింపవలెనె?
పటముకానుకఁ దెచ్చిపట్టిన నిప్పుడే చిత్తర్వునకు హర్వు చెప్పవలెనె?
మంచిమాటలు తోఁచె నంచును బలకలో నిప్పుడె కవిత వ్రాయింపవలెనె?
తే. గంట చెప్పినవారిఁ గ్రేఁగంటఁ గనెదు లెండు పోద మటన్న నటుండు మనెదు
వడిగ రావమ్మ కంచియే పడుకటిల్లు కన్నియలఁ గంటి మిటు లెందుఁ గానమమ్మ! 201

ఉ. ఎక్కడ నైన వేడుక మెయిన్ శుభవేళలఁ బాను పెక్కుచో
నొక్కసుమంత సిగ్గు వడుచుండెడు లేజవరాండ్రు లేరొ? యో
యక్క! యిదేమి? యింత గలదా? మఱి రేపిటువంటివారె పో
దక్కఁ బెనంగువారలు సదా మగనిం బిగికౌఁగిలింతలన్. 202

క. ఏకతమునఁ జెప్పుదుమో?
కా కందఱు వినెడునట్లు గాఁ జెప్పుదుమో?
మా కొక్కటి తోఁచినయది
నీ కెక్కడఁ గోప మగునో నీరేజముఖీ! 203

ఉ. కేవలభక్తితో నచటఁ గేలివనంబున నీవు సారెకున్
సేవ లొనర్చుచోఁ గలిగె నే కత యేకత నిందు వచ్చుచోఁ
ద్రోవల నిల్తురే కద వధూవరు లిద్దఱు నొక్కటైనచో
నేవగఁ బాఱునో మనసు లెవ్వ రెఱుంగుదు రమ్మ జవ్వనీ! 204

ఉ. వేగిరకాఁడు మన్మథుఁడు వెన్కకు ముందును జూడఁ డంతకున్
వేగిరకాఁడు నీ విభుఁడు వీరిఁ గటాక్షములందె యేలఁజా
ల్వేగిరకత్తె వీ వుచిత లీలఁ దలంతువొ? వేళ యెంతువో?
యీగరువంపు సిగ్గులపు డెక్కడ నుండు సరోజలోచనా? 205

ఉ. కన్నెఱచేసి చూచిన మొగ మ్మటు ద్రిప్పినఁ జే విదిర్చి నం
గన్నుబొమల్ ముడించినను గా దన మందుల కేమి? మున్ను మీ
రున్న తెఱంగు నంగకము లున్న తెఱంగుఁ దలంచి చూచినన్
గన్నియ! మాకు నమ్మికలు కావు సుమీ! పదిలక్ష లేనియున్. 206

తే. ఆయెఁ గా కుండె మంచిదే! యందు కేమి?
కొంతసే పిటు నవ్వితి మింతె మేము

చాలు నిఁక నైన జాగెల? సరసములనె
ప్రొద్దు పోయెడుఁ బదవమ్మ ముద్దుగుమ్మ." 207

చ. అని కయిదండ యొక్క మృదుహల్లకపాణి యొసంగ నొక్క మో
హన నవమౌక్తికోపమనఖాంకురపాపటఁ జక్కదువ్వ శో
భనశకునమ్ము లొక్క కలభాషిణి ముందరఁ దెల్ప మందగా
మిని యనుటెల్లనప్పుడిను మిక్కిలిగాఁ దనయందు నిల్వఁగన్. 208

ఉ. తాలిమిఁ గ్రుంగఁ ద్రొక్కి మదిఁ దత్తఱమున్ దమియున్ భయంబు హే
రాళముగాఁగ మైఁ జెమట గ్రమ్మఁగఁ గొంకుచు మెల్ల మెల్లనే
బాలిక యేఁగుదెంచె విభుపాలికిఁ బ్రాణసఖు ల్దెమల్పఁగా
యేలిక మ్రోలకున్ మనవి కేఁగెడు నయ్యభిమానిపోలికన్. 209

## సుభద్రార్జునుల శృంగార విలాస కృత్యములు

ఉ. చంచలనేత్రరాఁ గలుగుసంభ్రమ మేమనవచ్చు వాసనల్
ముంచుకొనన్ సమస్తగృహముల్ మిఱుమిట్లులు గొంచు నలడల్
ముంచుకొనెన్ దనూరుచులు ముంగిటి కించుక రాక తొల్తనే
ముంచుకొనెన్ నృపాలునకు మోహముఁ గోర్కులు నెమ్మనంబునన్. 210

తే. మఱుఁగఁ గోరెడికన్నియ తెఱఁగుఁ జూచి
చూడఁ గోరెడి యువరాజుజాడఁ జూచి
వలఁతు లయినట్టి యా కూర్మిపొలఁతు లపుడు
కూర్చి సమకూర్చి యిరువురఁ గూర్చి యనిరి. 211

తే. 'తేరు తా నెట్లు గడపెనో తెలియరాదు
తేరు కదలించునట్లు తోతేరవలసెఁ
గన్నె యిందాఁక నే మెఱుంగదుసుమయ్య
తేరుగడ కాఁగ మెల్లనె దిద్దుకొనుము. 212

క. పాటలబింబాధర కసి
గాటుల కోప దని పలువగలఁ దెలుపంగా
నేటికి? నెఱింగి నడుపుము
మీటిన విచ్చుచనుదోయి మీచేతి దిఁకన్. 213

తే. మీర లెఱుఁగంగ వలయు శృంగార మెల్ల
యువతితిలకంబు కంటె నో నవమనోజ!
విభుఁడు మది మెచ్చి కర్పూరవీటి యొసఁగ
ముద్దుమొగ మెత్తరాదె? యోమోహనాంగి! 214

క. వలరాజు కొల్చునంతటి
చెలువుఁడు నినుఁ గూడఁ గలిగెఁ జెప్పె డిదేమో?
కలఁ డిఁక నీపాలింటన్
జెలియా! యలచందమామ జేజే యెపుడున్. 215

క. రావక్క! వక్కలాకులు
గోవక్క! శుభోత్తరముగ గొబ్బున విభుచే
నీవక్క! సేవ సేయుము
నీ వక్కఱ కలిగి రమణునికిఁ జిత్తము రాన్.' 216

తే. అనుచుఁ గప్పురబాగాలు నాకుమడుపు
లచ్చకోరాక్షిచేతి కందిచ్చి మిగుల
నంతికము చేర్చి 'చేపట్టుమయ్య కోర్కు
లొదవఁ గాఁ జేయు నాసామి! యువతిశయము.' 217

క. అని కన్నియ హస్తాబ్జముఁ
దన శ్రీహస్తమునఁ జేర్పఁ దాత్పర్యమునన్
గొని యామాటలచతురత
మనమున మెచ్చుకొను రసికమణి వేమాఱున్. 218

చ. 'కలయఁగ మంచిలగ్న మిది గట్టిగ నే గడె లెన్నియయ్యెనో
తెలిసెద' నంచు నోర్తుఁ 'జనుదేర ద దే'మని యోర్తు 'నెచ్చెలిం
బిలిచెద' నంచు నోర్తు నొకపే రిడి వా రిటు లేఁగి రంద ఱ
చ్చెలియల వెంటనే సగము సిగ్గరిగెన్ దరుణీలలామకున్. 219

ఉ. పంచశిలీముఖంబులును బచ్చనివిల్లును బూని యెక్కుసం
ధించుచు నిర్భరం బెనఁచి నెమ్మిఁ గరంచుకడంకఁ జూడుమీ
యంచు గవాక్షసీమ నపు డాయెల తెమ్మెరఁ గూడి వేడుకన్
బొంచులు సూడఁగాఁ దొడఁగెఁ బో మకరాంకుఁడు గాన కుండఁగన్. 220

తే. పతియు సతికేలుపట్టినపట్టు విడక
పెడమఱల వామకరమునఁ బిఱుదుఁ జుట్టి
పట్టి రా నీడ్చి కూర్చుండఁ బెట్టె నపుడు
తొడ తొడయుఁ దాఁకఁ దమిసిగ్గుఁ గడకు నూక. 221

సీ. నెఱికొప్పుఁ గొనగోర నిమిరినయంతనే తళుకులే ముద్దుఁ జెక్కిలి చెమర్చెఁ
దళుకులేముద్దుఁ జెక్కిలి నొక్కినంతనే వలిగుబ్బచనుఁగవ పులకరించె
వలిగుబ్బచనుఁగవ నలమినయంతనే నతనాభినీవిబంధంబు ప్రిదిలె
నతనాభినీవిబంధము నంటినంతనే తను వెల్లఁ బరవశత్వంబు నొందె

తె. నవలఁ జెప్పెడి దెమి యానవరసికుఁడు తావిచెంగావిచక్కెరమోవి గ్రోలి
కుసుమశరుకేళి నేమేమిగుఱుతు లిడెనో బాల యెఱుఁగదు సౌఖ్యాబ్ధి దేలి యపుడు. 222

క. గాఢాలింగనవిముఖము
రూఢాంగస్వేదభరము రుంద్రవ్రీడా
గూఢాపాంగము నగుచు న
వోఢాసంగమము కొసఁగెం బతికిన్. 223

సీ. వీఁగుకొప్పున సాము విరిదండవెలిఁ గమ్మఁ గమ్మకస్తురిబొట్టు చెమ్మగిల్లఁ
దనువున మేల్పూతఁ తావిమాత్రమె చిక్కఁ జిక్క చన్గవ సరుల్ చిక్కువడఁగ
నొసలిపై ముంగురుల్ ముసరి ముద్దులు చూప జా పంతకు సొలపుఁ జూపఁ
జిన్నారిచెక్కులు చెమటఁ జిత్తడి నొంద నందంద యూర్పులు సందడింప
తే. నపుడు సమ్మతిఁ బతివేడ ననఁగి పెనఁగి లోనుగాకుండియు మృగీవిలోలనయన
యతని నానందవార్ధి నోలార్చె నౌర! కలయికలఁ గల్గుహరువులకలిమివలన. 224

తే. నొక్కి పలుమొనఁ బలుమొన నొక్క నేర్పె
నంటి గోరులచేఁ గళలంట నేర్పెఁ
జొక్కి బిగిఁ గౌఁగిలింతలఁ జొక్క నేర్పెఁ
జెలువుఁడు నవోఢఁబ్రౌఢఁగాఁ జేసెనపుడు. 225

సీ. జిలిబిలివలినాలి మొలకతెమ్మరలు కమ్మనిమేనితావుల ననుసరింప
నలరుఁ దేనియ లాని యలరుతుమ్మెదదిమ్ము జంటచూపుల వెనువెంటఁ దిరుగఁ
జిగురాకుమేఁతలఁ బొగరొందుకోయిలల్ పాటల నీటు వెంబడి మెలంగఁ
గుల్కుఁ బల్కులముద్దుగుల్కు చిల్కల నేర్పు పలుకుల బెళుకులపజ్జ నిలువ
తే. సతియుఁ బతియును నారామతతుల నతుల రతులఁ బెనఁగిరి చతురత లతిశయిల్లఁ
దొలుతఁ దము నేఁచువారలె కొలచియుండు వేడ్కకన్నను మఱి వేఱె వేడ్క కలదె. 226

క. నెల మసలె నంతఁ గాంతకు
నెలకొనె వేవిళ్లు పెల్లు నిద్దపుమేనం
దలతల మని మెయిపూఁతల
తళతళఁ దళుకొత్తఁ గ్రొత్తధవళిమ దోఁచెన్. 227

సీ. కలదు లేదో యనుకౌను కానఁగ నయ్యె ఱెప్పల నలసత కప్పుకొనియెఁ
గులుకుఁ జన్గుబ్బలు వలుఁదలై మెఱుఁ గెక్కె నూఁగారుపైఁగప్పు నూలుకొనియెఁ
జెక్కుటద్దంబుల నెక్కొనెఁ దెలినిగ్గు బడలిక నడుపులఁ గడలుకొనియెఁ
జిట్టూటచెమటలచిత్తడి మెయి నిండె సారెకు నూర్పులు సందడించె
తే. నరుచి గన్పించె నొకచెల్వ మంకురించెఁ దరులుసమ మయ్యెఁ జిట్టుముల్ దఱచు మీఱె
మొలచెఁ గోర్కులు నెమ్మేన నిలిచె నలఁత నెలఁత కేర్పడఁ దొలుచూలు నిలుచు నపుడు. 228

మ. కలుముల్ కన్నులఁ జిల్కుకల్కి మరునిం గన్నట్టిచందాన నా
కలశాంభోనిధివీచికల్పతరువుం గన్నట్టి యందంబునన్
గలకంఠీకులరత్న మంత శుభలగ్నం బందు నిం పొందఁగాఁ
గులదీపం బగునట్టిపట్టిఁ గనె దిక్కుల్ తెల్విఁ బెంపెక్కఁగన్. 229

క. ఋభువిభుసుతునకుఁ దనయుఁడు
ప్రభవించినసమయమున గుబాలునఁ గురిసెన్
నభమున సుమనోవర్షము
గుభగుభనినదములు గ్రందుకొనె దుందుభులన్. 230

తే. అపుడు పార్థుఁడు శుభలేఖ ననుప ననుప
మానవిభవుండు శౌరి సమానమాన
వాధినాథులు కొలువంగ నరుగుదెంచె
నెలమితోడుత పాండవు లెదురుకొనఁగ. 231

క. హలి సాత్యకితోడఁ గుతూ
హలియై తనసరస రాఁగ నంగనయును దా
నల బలరిపుసుతునగరికి
నలబలము చెలంగ నరిగె హరి కడు వేడ్కన్. 232

క. మన్యువివర్జితుఁ డల శత
మన్యుతనూభవుఁడు లోకమాన్యవిపశ్చి
న్మాన్యులయనుమతి సుతు నభి
మన్యుం డని పేరు వెట్టె మది ముదమొదవన్. 233

క. చెల్లెలికిని మఱఁదికి మే
నల్లునకు ననర్ఘ్యమణిమయాభరణంబుల్
వల్లభయుఁ దాను యదుకుల
వల్లభుఁ డపు డొసఁగె బంధువర్గము మెచ్చన్. 234

తే. కువలయాక్షులు పెనుచు మక్కువలవలన
నేఁటఁబెరిఁగెడువాఁడొక్కపూఁటఁ బెరిఁగి
మెల్లమెల్లన శైశవ మెల్ల జార
నందె యౌవన మారాజనందనుండు. 235

సీ. మనుమార్గమున భూమి మను మార్గ మంతయు స్థిరబుద్ధి యగు యుధిష్ఠిరుఁడు తెలుపఁ
బాటవవద్వైరిపాటనక్రమ మెల్ల దరవర్జితుఁడు వృకోదరుఁడు తెలుప

రంగదుత్తుంగతురంగాధిరొహ ముద్దండబాహుఁడు నకులుండు తెలుప
సురభిరక్షణకీర్తి సురభిళదిఙ్మండ లుండగు తదనుజన్ముండు తెలుప
తే. వివిధకోదండ పాండిత్య విలసనంబు తానె తెలుపంగ నేర్చిన తనయుఁ డెపుడు
సేవ సేయఁగ సంతతశ్రీ వెలుంగ విజయుఁ డలరారె శాశ్వతవిజయుఁ డగుచు. 236

## ఫలశ్రుతి

క. శ్రీరాజిలు రఘునాథో
ర్వీరమణుని పేర వెలయు విజయవిలాసం
బారోగ్యభాగ్యసంప
త్సారస్వతజయము లొసఁగుఁ జదివిన వినినన్. 237

## ఆశ్వాసాంతము

ఉ. క్ష్వేళగళైణలాంఛన విజిత్వర శుభ్రయశోవిశాల! ధా
రాళగళన్మద ద్విరదరాజివిరాజిసభాంగణా! ఘనా
వేలగరిష్ఠదానపదవీపరితోషితకాళగౌతమీ
చోళకవిద్విజస్తుతవచోలగ! చోలగమానభంజనా! 238

భుజంగ ప్రయాతము. అరాతిక్షమాభృద్భిదాంచత్కృపాణా!
నరాధీశ్వరాకారనాళీకబాణా!
స్థిరానందనా రామసేవాధురీణా!
విరాజచ్చతుష్షష్టివిద్యాప్రవీణా! 239

గద్యము. ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ ప్రసిద్ధ సారస్వత సుధాసార జనిత యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్యతనయ వినయ ధురీణ సకల కళాప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ భూపాలదత్త హస్తముక్తాకటక విరాజమాన వేంకట కవిరాజ ప్రణీతంబయిన విజయవిలాసంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము

విజయవిలాసము
సంపూర్ణము

---

మదరాసు: వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి 'వావిళ్ళ' ప్రెస్సున ముద్రితము. — 1969 — కాపీలు 2000.